అగ్ని—యెన్నేళ్ళైతేనేవిఁ? నలభైయ్యయిదు.

గిరీశం—లుబ్ధావధాన్లు మా పెత్తల్లి కొడుకండి. తమతో సమ్మంధవఁంటే నాకు సంతోషవేఁగానండి. ఆయనకి అరవయ్యేళ్లు దాటాయండి. యీ దేవఁయినా సెల్లింగ్ గర్లస్ అనగా కన్యాశుల్కం, డామిట్! యంత మాత్రమూ కూడదండి. నేను పూనాలో వున్నప్పుడు అందు విషయమై ఒహనాడు నాల్గుంటలు ఒక్కబిగిని లెక్చరిచ్చానండి. సావకాశంగా కూర్చుంటే కన్యాశుల్కం కూడని పనని తమచేతనే వొప్పిస్తాను.

కరట—బావా యీసమ్మంధం చేస్తే నీ కొంపకి అగ్గెట్టేస్తాను.

అగ్ని—వీళ్లమ్మా శిఖాతరగా, ప్రతీగాడిదకొడుకూ తిండిపోతుల్లాగ నా యింట జేరి నన్ను నేవాళ్ళే. తాంబోలం యిచ్చేశాను. యిహ తన్నుకుచావండి.

వెంకమ్మ—నాతో చప్పకుండానే?

అగ్ని—ఆడముండల్తోనా ఆలోచన? యీ సమ్మంధం చైకపోతే నేను బారికరా వుఁణ్ణే! (లేచి వెళ్లును.)

కర—యెంమార్దవం.

వెంక—అన్నయ్యా! యీ సమ్మంధం చేస్తే నేన్నుయ్యో గొయ్యో చూసుకుంటాను; పెద్దదాన్ని రొమ్ముమీద కుంపట్లాగ భరిస్తూనే వున్నాం. ఆయనికి యంత యీడొచ్చినా కష్టంసుఖం వొళ్లునాటక యీదౌర్భాగ్యపు సమ్మంధం కల్పించుకొచ్చారు. నే బతికి బాగుండాలంటే యీ సమ్మంధం తప్పించు.

కర—గట్టి అసాధ్యం తెచ్చిపెట్టావే, వొట్టి మూర్ఖప గాడిదకొడుకు. యెదురుచెప్పిన కొద్దీ మరింత కొత్తెక్కుతాడు. యేఁ చేయగల్గుదునని నీకు భరుసా చెప్పను? యేమీ పాలుపోకుండా వుంది.

గిరీ—అమ్మా—మీరు యెందుకలా విచారిస్తారు? అవుఁధాన్లుగారు సావకాశంగా వున్నప్పుడు ఒక్కగంట కూర్చుంటే డబ్బుచ్చుకు ముసలివాళ్ళకి పెళ్ళిచెయ్యడం దౌర్జన్యవఁని లెక్చరిచ్చి మనసు మళ్ళిస్తాను.

వెంకమ్మ—బాబూ, అతడు మీ మానత్తకొడుకైతే మీ కాళ్ళు పట్టుకుంటాను. మీరు వెళ్ళి ఆయన్ని మనస్సు మళ్ళిస్తురూ. నాచర్మం చెప్పులు కుట్టియిస్తాను.

గిరీ—అమ్మా యేంచెప్పను! వాడో త్వాష్ట్రిం పిల్లదొరకడవేఁ చాలు వాడికి. యీ సమ్మంధం వొదులుకుంటే వాడికి పెళ్ళేకాదు. వాడని వాడొదిలే ఘటంకాదు.

కర—అమ్మీ నేనో ఉపాయం చెబుతాను యిలారా. (కరటకశాస్త్రి శిష్యుడు వెంకమ్మ నిష్క్రమింతురు.)

గిరీ—మైడియర్ షేక్స్పియర్! నీ తండ్రి అగ్గిరావుఁడోయి మీ యింట్లో యవళ్ళకి అతణ్ణిలోంగదీశే యలోక్వెన్సు లేదు. నాదెబ్బచూడు యీవాళేం జేస్తానో

వీరేశలింగం పంతులుగారు కన్యాశుల్కం విషయమై రాసిన ఉపన్యాసం పైకి తీయ్. మావఁగారికి లెక్చరివ్వడాని కత్తీ కఠారీనూరాలి.

వెంకటే—మీ లెక్చరుమాట అలావుణ్ణిండిగాని యీవాళ నాగండం గడిచింది గదా అని సంతోషిస్తున్నాను. మీ జ్ఞాకపోతే పరిక్ష ఫేలయినందుకు మా నాన్న పెయ్యకట్టుతాడుతో చమ్డా లెక్కగొట్టును.

గిరీ—యిలాంటి ప్రమాదా ల్తప్పించుకోవడవేఁ ప్రజ్ఞ. యేమైఁనా డిఫికల్టీవొచ్చి నప్పుడు ఒక రసాన్నవేశాంవఁంటే అది బ్రహ్మాభేద్యంగా వుండాలి. పొలిటిషన్ నంటే మరేవిఁటనుకున్నావ్ ? పూజా నమస్కారాల్లేక బూజెక్కున్నాను గాని మన కంట్రీయే ఇండిపెండెంట్ అయితే గ్లాడ్స్టన్ లాగ దివాన్గిరి చలాయిస్తును. యేమి వాయ్! మీ తండ్రివైఖరి చూస్తే పుస్తకాలకి సొమ్మిచ్చేటట్టు కనబడదు చుట్టలు పట్నంనించి అరకట్టై తెచ్చాంగదా, యేమి సాధనం ?

వెంకటే – నాన్నివ్వకపోతే అమ్మనడిగి డబ్బుతెస్తాను.

గిరీ—నీ బుద్ధియలా వికసిస్తూందో చూశావా ? యిలా తర్ఫీదవుతుంటే నువ్వుకూడ పెద్ద పొలిటీషను వవుతావు;

[ బుచ్చమ్మ ప్రవేశించును ]

బుచ్చమ్మ—తమ్ముఁడూ అమ్మ కాళ్లు కడుక్కోమంచూందిరా.

గిరీ—(తనలో) హా బ్యూటిఫుల్ ! క్రైటనెక్ స్పెక్ట్డ్ !

బుచ్చమ్మ—అయ్యా మీరు చద్దివణ్ణం తించారా ?

గిరీ—నాట్ది స్లైటస్టబ్జక్షన్, అనగా యింత మాత్రం అభ్యంతరంలేదు. వడ్డించం డిదుగో వస్తున్నాను. తోవలో యేటిదగ్గిర సంధ్యావందనం అదీ చేసుకున్నాను. (బుచ్చమ్మ వెళ్లును)

గిరీ—వాట్ యీమె నీ సిస్టరా ? తలచెడ్డట్టు కనబడుతున్నదే ?

వెంకటే—మాఅక్క, జుత్తుకి చవుఁజ్జాసుకోదు.

గిరీ—తల చెడ్డం అంటే, విడో అన్నమాట. చవుఁరు గివుఁరూ జాంతేనయ్. గాని యిన్నాళ్ళాయి నీకు విడో మారేజి విషయవై లెక్చర్లిస్తూవుంటే యీ కథ యెప్పుడూ చెప్పావు కావు ? మీ యింట్లోనే ఓ అన్ఫార్చునేట్ బ్యూటిఫుల్ యంగ్ విడో వుందటోయ్ ! యేమి దురవస్థ! మైహార్ట్ మెల్ట్స్. నేనేతండ్రి నైతే యీపిల్లకి విడోమారి యెజ్జేసి శాశ్వతవైఁన కీర్తి సంపాదిస్తును. (తనలో) యేమి చక్కదనం, యీ సొంపు యక్కడా చూశ్ళేదే ! పల్లిటూరు పూసు పోదనుకున్నాను గాని పెద్ద కాంపేనుకి అవకాశం యిక్కడ కూడ దొరకడం నా అదృష్టం.

వెంకటే—మా నాన్న నాకూడా పెళ్ళి చాస్తాడు.

గిరి—యీ వాళో పెద్ద పెళ్ళి నీకు తలవెంట్రుకంత వాసి తప్పి పోయింది. యీ శలవులాఖర్లోగా తాళాధాయ్యం కాకుండా తప్పించుకుంటే నువ్ పూరా ప్రయోజకుడివే. యిహా నిజవైన పెళ్ళా? యింత చదువూ చదువుకుని నీ తండ్రికుదిర్చిన యేవీయరగని చిన్న పిల్లకా పుస్తెకడతావ్? మాంచియెబ్బిగా బుజ్జిగావున్న యంగ్విడోని నువ్ పెళ్ళాడకపోతే ఐమడ్చి యమేమ్డావ్యూ!

## ౨-వ స్థలము. దేవాలయం

[పువ్వుల తోటలో మండపంమీద కూచుని, శిష్యుడు ప్రవేశించును]

శిష్యుడు—ఆర్నెల్లకోమాటు పుస్తకం పట్టుకుంటే కొత్త శ్లోకాలు పాత శ్లోకాలు ఒక్కలాగ్కనపడతాయి, యిప్పుడు కొత్తశ్లోకం కనుక్కోమంటే నాశక్యవా? సిద్ధాంతి నెవణ్ణయినా ప్రశ్నడిగి కనుక్కోవాలి. లేకుంటే చటుక్కునపుస్తకం విప్పియే శ్లోకం కనబడితే ఆశ్లోకం చదువుతాను.

"మృగాః ప్రియాళుద్రుమమంజరీణాం"

యిదేదో చదివినజ్ఞాపకం లీలగావుంది, లేళ్ళుపరుగెత్తా యని కాదూ? యేం గొప్పమాట చెప్పాడోయి కవి! లేళ్ళు పరిగెత్తితే యవడిక్కావాలి, పరిగెత్తక పోతే యవడిక్కావాలి? కుక్కలు పరిగెత్తుతున్నాయ్ కావా, నక్కలు పరిగెత్తుతున్నాయ్ కావా? పిల్లులు పరిగెత్తుతున్నాయి కావా? పనికొచ్చే ముక్క ఒక్కటీ యీ పుస్తకంలో లేదు. నాలుగంకెలు బేరీజు వేయడం. వొడ్డీ వాశీ కట్టడం కాళిదాసు కేం తెలుసు? తెల్లవాడిదా మహిమ! యేపట్నం యెక్కడుందో, యేకొండ లెక్కడున్నాయో అడగవయ్యా గిరీశంగార్ని; నిలుచున్నపాట్ను చెబుతాడు.

"ప్రియాముఖం కింపురుషశ్చుచుంబ"

ముద్దెట్టు కున్నాడటోయి ముండాకొడుకు. ముక్కట్టు కున్నాడు కాదూ?

[కరటకశాస్త్రి శిష్యుడికి కనపడకుండా వెనుకనుంచి ప్రవేశించును]

"వణక్ప్రకర్షే సతి కర్ణికారం।
ధునోతినిగణం ధశయాస్మచేతః" ॥

యిదికూడ చదివినట్టే వుందోయి, ఆ పువ్వేదో కవికిష్టం లేదట. యిష్టం లేకపోతె మిగిలిపోయింది కాబోలు? మా గురువుగారికీ దొండకాయ కూరయిష్టంలేదు, గురువుగారి పెళ్ళాం పెరట్లో దొండపాదుందని రోజూ ఆకూరె వొండుతుంది. బతికున్న వాళ్ళ యిష్టవే యిలా యేడుస్తూంటే చచ్చినవాడి యిష్టాయిష్టాల్తోయేంపని

యీచదువిక్కడితో చాలించి గిరీశంగారి దగ్గిర నాలుగింగిలీషు ముక్కలు నేచుకుంటాను. వెంకడికి యింగిలీషొచ్చునని యేం గర్రాగా వుంది?

కర—యెవిట్రా అబ్బీ అంటున్నావు ?

శిష్యు—యేదో నాస్వంత ఘోష.

కర—గురువునిగదా, అదేదో నాకూ కొంచెం చెబుదూ.

శిష్యు—చప్పడాని కేంపుంచదండి! నాటకంలో నాచేత వేషం కట్టించి పెద్దచాంతాళ్ళలాంటి హిందూస్తానీ ముక్కలూ, సంస్కృతం ముక్కలూ అర్థంతెలియకుండా భట్టీయం వేయించడానికి మీకు ఓపికుందిగాని నాకు నాల్రోజులికో శ్లోకం చెప్పడానికి శ్రద్ధలేదుగదా ? పట్నంవొదిలి ఆరెల్లకోమాటు అగ్రహారాలంటవొచ్చినప్పుడు మరేం పూసుకోక "పుస్తకం తియ్యంశే" సంస్కృతం యెంవచ్చేని ?

కర—యిటుపైన్నూంచు యలా చెబుతానో, రోజుకి నాలుగే శ్లోకాలు చెబుతాను. కొత్తశ్లోకం చదువు.

శిష్యు—"అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా ।
హిమాలయో నామనగాధిరాజః"

కర—మొదటికొచ్చేవేం ?

శిష్యు—మొదలూకొసా వొక్కలాగే కనపడుతూంది.

కర—(నవ్వి) పోనియ్, మొదణ్ణించే చదువుదాం,

శిష్యు—చదివినా యేంలాభవుంది, యీశ్లోకం శుద్ధ అబద్ధంట.

కర—యవరు చెప్పారు ?

శిష్యు—గిరీశంగారు.

కర—యేం చెప్పాడు ?

శిష్యు—హిమాలయం రెండుసముద్రాలకీ దాసి, రూళ్ళ గర్రలాగలేదట. మాపులో చూపించాడు.

కర—హిమాలయం శిగగోశిరిగాని. ఆ పుస్తకం ముణిచి నామాటవిను.

శిష్యు—చిత్తం (పుస్తకం మూయును.)

కర—చదువన్నందుకు పొట్ట పోషించుకోడానిగ్గదా ?

శిష్యు—అవును.

కర—యీ రోజుల్లో నీ సంస్కృత చదువెవడి క్కావాలి.

శిష్యు—దరిద్రులి క్కావాలి.

కర—బాగా చెప్పావు. నీకు యింగ్లీషు చదువుకోవాల్నుందా ?

శిష్యు—చెప్పించేదా తేడీ ?

కర—నేను చెప్పిస్తాన్రా ?
శిష్యు—నిజంగాను ?
కర—నిజంగాన్రా. గాని ఒక షరతుంది.
శిష్యు—యేవిఁటండి ?
కర—నాకో కష్టసాధ్యమైన రాచకార్యం తటస్థించింది; అది నిర్వహించి నువ్వు చేసుకురావాలి.
శిష్యు—నా వల్లయేరాచకార్యాలు కూడా వున్నాయా ?
కర—యీరాచకార్యం నీ వల్లేకావాలి. మరెవడివల్లాకాదు, అదేవిఁటంటే, ఓ పది రోజులు నువ్వు ఆడపిల్లవై పోవాలి.
శిష్యు—గణియం పట్నంలోవుండి పోయిందే ?
కర—అట్టే గణియం అవసరంలేదు. నీకు తలదువ్వి, కోకకడితే పజ్యాండేళ్ళ కన్నె పిల్లలావుంటావు. నిన్ను తీసుకెళ్ళి లుబ్ధావుధాన్లికి పెళ్ళిచేస్తాను. నాలుగుపూటలు వాళ్ళింట నిపుణతగా మెసిలి, వేషం విప్పేసి పారిపోయిరా, నిజమైన పెళ్ళి ముహూర్తం చాలా వ్యవధుంది.
శిష్యు—యిదెంతపని.
కర—ఆలా అనుకోకు. అది చేస్తివట్టాయనా, అనుమాన పడతారు. పట్టుబడ్డా వంటే పీక తెగిపోతుంది.
శిష్యు—మీకా భయంవొద్దు.
కర—నువ్వునెగ్గుకొస్తే, మాపిల్లనీకిచ్చి యిల్లరికం వుంచుకుంటాను.
శిష్యు—అలాప్రమాణం చెయ్యండి.
కర—యిదుగో యీపుస్తకం పట్టుకు ప్రమాణం చేస్తున్నాను.
శిష్యు—యీపుస్తకం మీద నాకు నమ్మకం పోయింది, మరోగట్టి ప్రమాణంచెయ్యండి. గిరీశంగారిని అడిగి ఒక యింగిలీషు పుస్తకం పట్టుకురానా ?
కర—తప్పితే భూమితోడ్రా.
శిష్యు—మీరు యగేస్తే భూవేఁం జేస్తుంది ? మీ మాటేచాలును కానీండి.

### 3–వ స్థలము. అగ్నిహోత్రావుధాన్లు యింటియెదటివీధి.

[ గిరీశం, వెంకటేశం ప్రవేశింతురు ]

వెంకటే—రాత్రి కన్యాశుల్కం మీద లెక్చరిచ్చారా ?
గిరీ—లెక్చరేవిఁటోయి, ధణుతెగిరి పోయింది. మీతండ్రి మైరావణచరిత్రోయ్. మీ అంకుల్ కరటకశాస్త్రి స్కాండ్రల్లా కనపడుతున్నాడు.
వెంకటే—యేం జరిగిందేం జరిగిందేవిఁటి ?
గిరీ—విను. రాత్రి భోజనాలవేళ లెక్చరు ఆరంభించమని రోజల్లా బురిడీలు పెట్టాడోయ్ మీ మావఁ నబ్జక్టు నేను కొంచెం యెత్తగానే తనుకూడా గట్టిగా సపోర్టు చేస్తా

నని ప్రామిస్ కూడా చేశాడు. నీ తండ్రి వైఖరి చూస్తే మాత్రం కొంచెం ధైర్యం వెనకాడి నాలిక్కొనకొచ్చిన మాట మళ్ళీ మణిగి పోతూండేది. పెరుగూ అన్నం కలుపుకునే వేళకి యిక ధైర్యం చాలించి పోతూందని తెగించి లెక్చరు ఆరంభించాను. ఇంట్రడక్షన్ రెండు సెంటెన్సులు యింకా చెప్పనే లేదు నాలుగు యింగ్లీషు మాటలు దొల్లాయో లేదో దాంతో నీతండ్రి కళ్ళెరజేసి "యీ వెధవ యింగ్లీషు చదువునుంచి బ్రాహ్మణ్యం చెడిపోతూంది; దేవభాషలాగ భోజనాల దగ్గిర కూడా ఆ మాటలే కూస్తారు; సంధ్యావందనం శ్రీసూక్త పురుష సూక్తాలూ తగలబడిపోయినాయి సరే గదా?" అని గట్టిగా కేకవేసి చెప్పేసరికి నేను కొంచెం పస్తాయించి "ప్రోయింగ్ పెరల్సు బిఫోర్ స్వైన్" అనుకొని కరటక శాస్త్రుల్లువేపు చూసేసరికి యేంచేస్తున్నాడనుకున్నావ్? రాస్కెల్ పులకలేదు పలుకలేదు సరేకదా ముహం ప్రక్కకితిప్పి కడుపుబ్బేటట్టు నవ్వుతున్నాడు. యిక లెక్చరు వెళ్ళిందికాదు సరేకదా, శ్లోకమ్ముద్దకూడా వెళ్ళింది కాదు. ఛీ యింత యిన్సల్టు జరిగిన తరవాత తక్షణం బయలుదేరి వెళ్ళిపోదా మనుకున్నాను.

వెంకటే— అయ్యో వెళ్ళిపోతారా యేమిటి?

గిరీ— నా [illegible]. కొసాకవిను, నీ తండ్రిని పోకెట్లో వేశాను.

వెంక— నా తండ్రికి లెక్చరిచ్చి పెళ్ళి తప్పిస్తానన్నారే?

గిరీ— పెళ్ళి ఆపడానికి బ్రహ్మశక్యంకాదు. ఆ మాస్టరీసు సురేంద్రనాద్ బానర్జీ వచ్చి చెప్పినా నీ తండ్రి యీ పెళ్ళి మానడు. లెక్చర్లు యింతసేపూ సిటీల్లోనేగాని పల్లెటూళ్ళలో యంతమాత్రం పనికిరావు. పూనాలాంటసిటీలో లెక్చర్ యిచ్చావంటే టెంథౌజండు పీపిల్ వినడానికి వొస్తారు. మన దేశంలోనే, పెద్ద మీటింగులు చెయ్యాలంటే, డప్పులు బజాయించి, నోటీసులు కట్టి, బజార్లుకాసి, తోవంట పోయేవాళ్ళని యీడ్చుకు వొచ్చినా, యాభై మందికారు. పల్లెటూరి పీపిల్ లెక్చర్లకి అన్‌ఫిట్. మొన్న మనం వొచ్చినప్పుడు నాడికి నాషనల్ కాంగ్రెస్ విషయమై రెండు ఘంటలు లెక్చరు యిచ్చేసరికి అగాడదకొడుకు వాళ్ళ వూరు హెడ్ కానిస్టేబిల్ని కాంగ్రెసువారు యెప్పుడు బదిలీ చేస్తారని అడిగాడు! విలేజస్‌లో లెక్చర్లు యంతమాత్రం కార్యంలేదు; నీ తండ్రి దగ్గిర మాత్రం లెక్చరన్నమాట కూడా అనకూడదు.

వెంకటే— అయితే, నాన్నని యలాగ జేబులో వేశారేమిటి?

గిరీ— అది పొలిటిక్సు సెక్రెట్! ఆ తరవాత కథ విను, నాలెక్చరు కాస్త కోసిన తరవాత కోపవశుడై, ఘుమఘుమ లాడుకుంటూ పెరుగూ అన్నం కుమ్మడం ఆరంభించాడు. ఇంతలో మీ అప్పవొచ్చి గుమ్మంవద్గిర నిలబడి కోకిలకంఠంతో

"నాన్నా తమ్ముడికి పెళ్ళిచెయ్యాలంటే నాసొమ్ము పెట్టి పెళ్ళిచెయ్యండి గాని దానికొంపముంచి ఉబ్బాద్ధావుధాన్లకి యివ్వొద్దని" చెప్పింది. దాంతో నీతండ్రికి వెఱ్ఱికోపం వొచ్చి వుత్తరాపోసనం పట్టకుండానే ఆ పెరుగూ అన్నంతో విస్తరి తీసికెళ్ళి దాన్నెత్తిని రుద్దేశాడు! కంటక శాస్తుల్లు అడ్డుపడబోతే చెంబుతో నీళ్ళు వాడి నెత్తిందిమ్మరించాడు. కరటకశాస్తుల్లుకి కోపంవొచ్చి శిష్యుణ్ణితీసుకు వాళ్ళవూ రెళ్ళిపోయినాడు.

వెంకటేశ—దీనిపేరేనా యేవిఁటి మానాన్నంజేబులో వేసుకోవడం ?

గిరీ—పేషన్స్! కొసాకీ విను. స్కౌండ్రల్ కరటక శాస్తుల్లు వెళ్ళిపోయి నాడని సంతోషించాను గాని, నీ సిష్టర్ ఫేట్ విషయమై మహా విచారమైంది. నేనే దాని హజ్బెండై వుంటే, నిలబడ్డసాటున నీ తండ్రిని రివాల్వర్తో షూట్ చేసి వుందును. మీఅమ్మ యేడుస్తూఒకమూలకూచుంది. అప్పుణ్ణేవెళ్ళి, నీళ్ళపొయిలో నిప్పేసి, నీళ్ళుతోడి, నీసిస్టర్ని స్నానం చెయ్యమన్నాను. సిగర్సు కాల్చుకుందావని అరుగుమీద నేను బిచాణావేసే సరికి, నీ తండ్రికి పశ్చాత్తాపం వొచ్చి తానూ ఆ అరుగుమీదే బిచాణావేసి ఒక్క సిగరయినా కాల్చనియ్యకుండా రాత్రల్లా కబుర్లలో పెట్టి చంపాడోయ్. మొత్తానికి కత్తు కలిపేశాను.

వెంకటేశ—యాలాక్కలిపారేవిఁటి ?

గిరీ—ఒక పొలిటికల్ మహాస్త్రం ప్రయోగించి కలిపేశాను.

వెంకటేశ—యెవిఁటండా అస్త్రం ?

గిరీ—ఒకడు చెప్పిందల్లామహాబాగుందండవేఁ. సమ్మోహనాస్త్రవంటే అదేకదా ?

వెంకటేశ—లెక్చరిచ్చి మాతండ్రిని వొప్పించడానికి బదులుగా ఆయన చెప్పిం దానికి మీరే వొప్పుకున్నారూ ?

గిరీ—కుంచం నిలువుగా కొలవడానికి పీల్లేనప్పుడు తిరిగే సైనాకొలిస్తే నాలుగ్గింజలు నిలుస్తాయి. బాగా ఆలోచిస్తే యిన్ఫెంటు మారియేజి కూడునదే తోస్తూంది.

వెంకటేశ—యిన్నాళ్ళూ కూడదని చెప్పేవారే నాతోటి ?

గిరీ—ఒపినియన్సు అప్పుడప్పుడు ఛేంజి చేస్తూంటేనేగాని పొలిటిషను కానేరడు. నాకు తోచిన కొత్త ఆర్గ్యుమెంటు విన్నావా? యిన్ఫెంటు మారేజీలు అయితేగాని యంగ్ విడోజ్ వుండరు. యంగ్ విడోజ్ వుంటేనే గాని, విడో మారియేజ్ రిఫారమ్కి అవకాశం వుండదు గదా? సివిలిజేషనక్కల్లా నిగ్గు విడో మారియేజ్ అయినప్పుడు, యిన్ఫెంట్ మారేజీల్లేకప్పోతే, సివిలిజేషన్ హాల్టవుతుంది! మరి ముందు అడుగు పెట్టలేదు గనుక తప్పకుండా యిన్ఫెంటు మారేజి చెయ్యవలసిందే యదివాహ కొత్తడిస్కవరీ; నంబర్ టూ, చిన్న పిల్లల్ని ముసలాళ్ళకిచ్చి పెళ్ళిచెయ్యడం కూడా మంచిదే అని నేను వాదిస్తాను.

వెంకశే—సుబ్బిని లుబ్ధావుధాన్లకి యివ్వడం మంచిదంటూరా యేవిఁటి ? అమ్మ ఆ సమ్మంధం చేస్తే నూతులో పడతానంటూoదే ?

గిరీ—ఫెమినైన్స్ ఫూల్సన్నాడు. "పడుపడు అన్నా నా సవితే గాని పడ్డనాసవితి లే"దంది వెవర్తోను. నూతులో పడడం గీతులోపడడం నాన్సెన్స్, ఓ రెండు తులాల నరుకోటి మీనాన్న చేయించి యిచ్చాడంటే మీ అమ్మ ఆమాట మానేస్తుంది. గాని నా ఆర్గ్యుమెంటు విను.

వెంకశే—యేవిఁటండి.

గిరీ—పెళ్ళనే వస్తువ శుభవాఁ అశుభవాఁ ? మంచిదా చెడ్డదా ? చెప్పు

వెంకశే—మంచిది.

గిరీ—వెరెగుడ్ ! పెళ్ళ నేది మంచి పదార్థవైఁతే "అధికస్య అధికం ఫలం" అన్నాడు గనక చిన్నపిల్లని ఒక ముసలాడికి పెళ్ళి చేసి, వాడు చస్తే మరోడికి, మరోడుచస్తే మరోడికి, యిలాగ పెళ్ళిమీద పెళ్ళి, పెళ్ళిమీద పెళ్ళిఅయి, వీడిదగ్గిరో వెయ్యి, వాడి దగ్గిరో వెయ్యి, మరోడిదగ్గిర మరో వెయ్యి, రొట్టెమీద నెయ్యి, నేతిమీద రొట్టె, లాగ యేకోత్ర వృద్ధిగా కన్యాశుల్కం లాగి, తుదకి నాలాంటి బుద్ధివంతుణ్ని పెళ్ళాడితే చెప్పావ్ మజా ? ఇహ సౌఖ్యం పూర్తిగా లభిస్తుంది. ఇహ సౌఖ్యంవుంటే పరసౌఖ్యం కూడా సాధించావేఁ అన్నమాట. యలాగో తెలిసిందా ? ఈజ్ మెంటు హక్కు యస్టాబ్లిష్ అవుతుంది.

వెంకశే—కన్యాశుల్కంకూడ మంచిదంటున్నారేవిఁటి ?

గిరీ—మ రేవిఁటనుకున్నావ్ ? వెవ్వర్డ్లాభైహోన్సన్నాడు, చేస్తే శుద్ధశువరవేఁగాని తిరపతి మంగలాడి శువరం చెయ్యకూడదు, యీ అస్త్రంతోటే మీ తండ్రి వశ్యం అయినాడు. యింగ్లీషువాడు "థింక్" అన్నాడోయి. ఆలోచిస్తే గాని నిజం బోధపడదు. కాగా ఆలోచించగా, కన్యాశుల్కంలేని మారేజే యీ భూప్రపంచంలో లేదు. విన్నావా ?

వెంకశే—యెలాగండి ?

గిరీ—అలా అడగవోయి, యేం ? డబ్బుచ్చుకుంటేనే కన్యాశుల్కవఁయిందేం ? యిన్నితులాలు బంగారం పెట్టాలి, యింత వెండి పెట్టాలి, అని రూపాయిలకి బదులుగా వెండిబంగారాలకింద ధనం లాగితే, కన్యాశుల్కం అయిందికాదేం ? యీ పెద్దపెద్ద పంతుళ్ళవారంతా యిలా చేస్తూన్నవారేనా ?

వెంకశే—అవును.

గిరీ—యిక దొర్లలోనో ? వాళ్ళతస్సాగొయ్యా, యిల్లుగుల్లచేస్తారోయి; అవిగుడ్డలు కావు. అవి శెంట్లుకావు. అవి జూయల్సుకావు, మారీయేజి సెటిలుమెంటని భోలెడు ఆస్తి కూడ లాగుతారు, యీ ఆర్గ్యుమెంటు నేను చెప్పేసరికి నీ

తండ్రి బ్రహ్మానందభరితుడైనాడు. లుబ్ధావుధాన్లు పెళ్ళికి అన్నిటికన్న పెద్ద నవభోకటి నీకు చెబ్తానువిను

వెంకశే— యేవిఁటండి.

గిరి— లుబ్ధావుధాన్లు ముసలాడూ, బంగారప్పిచికా సున్నా. రెండేళ్ళకో మూడేళ్ళకో అమాంతంగా చాప్చి వన్నేస్తాడు, అనగా "కిక్సు ది బకెట్." దాంతో నీ చెల్లెలు రిచ్చి విడో అవుతుంది నువ్వు పెద్దవాడివైనఁ తరవాత దానికి విడోమారియేజి చేసి శాశ్వతమైన కీర్తి అతిసులభంగా సంపాదించ వచ్చును. యేవఁంటావ్ ?

వెంకశే— అవును.

గిరి— మరో గొప్పమాట ! యీ సంబంధం అయితే నీకూ నాకూ సంబంధం కలుస్తుం దోయి.

వెంకశే— అది నాకిష్టనేఁ.

గిరి— రాత్రి నీ తండ్రి, నీకు హైకోర్టు వకాల్తీదాకా చదువు చెప్పిస్తానన్నాడు ప్రస్తుతోపయోగం పుస్తకాలమాట కదిపాను గాని, పెళ్ళి నుంచి వచ్చిం తరువాత యిస్తానన్నాడు. యీలోగా చుట్టనుక్కల్లాకపోతే గుడ్లెక్కొస్తాయి. సిగర్సుకోసం కావ్సినవఁయినా సంపాదించావా లేదా ?

వెంకశే— లేదు. యీ వుదయవఁల్లా అమ్మ ధుమధుమలాడుతూనే వుంది. మా నాన్న పొడుం కోసం కొట్లోనిలువ చేసిన పొగాకులోంచి వోకట్ట వోణీలో దాచి తీసుకొచ్చాను.

గిరి— దటీజ్ పోలిటిక్సు ! మరియింతసేపూ చెప్పావుకావేం ? చుట్టల్చుట్టుకొని యీకోవిల గోపురంలో కూచుని కాల్చుకుందాం రా !

వెంకశే— కోవిల్లో చుట్ట కాల్చ వొచ్చునా ?

గిరి— కాలిస్తే కోవిల్లోనే కాల్చాలోయి. దీని పొగ ముందర సాంబ్రాణి, గుగ్గిలం యేమూల ? యేదీ కట్టయిలా తే (కట్ట అందుకొని వాసనచూసి) ఆహా! యేవి పొగాకోయి !. నిజంగా కంట్రీలైఫులో చాలా చమత్కారం వుంది. బెస్టుటొబాకో, బెస్టుగేదెపెరుగు, మాంచిఘీ, అంచేతనే న్యోయ్ పోయట్సు "కంట్రిలైఫ్ కంట్రీలైఫ్," అని దేవులాడుతారు,

వెంకశే— మీరూ పోయట్సే గదా ?

గిరి— అందుకభ్యంతర వేఁవిటి ? నాకూ కంట్రీలైఫు యిష్టవేఁగాని సీవఁల్లోలాగ బ్యూటిఫుల్ షెపర్డెస్సూ, లవ్ మేకింగూ వుండదోయ్, గ్రాస్ గల్సున్న తగు మాత్రంగా వుంటారుగాని, మాకటీజ్ స్మెల్ ! అదొహటిన్నీ మనదేశంలో

మెయిడన్సు వుండరోయి యంతసేపూ అన్మేకింగ్ విడోజ్కి చెయ్యాలి గాని మరిసాధనాంతరం లేదు.

వెంకటే—మీరు విడోమీద చేసిన పొయిట్రీ రాసియిస్తానని యిచ్చారుకారు గదా ?

గిరీ—అడగ్గానే యిస్తే వస్తువవిలవ తగ్గిపోతుంది. అదొహాటిన్ని, మళ్లొండేళ్ళు పోతేనే గాని దాని రసం నీకు బాగా బోధపడదు. అయినా స్పెషల్ కేసుగా నీకు ఉపదేశం చాస్తాను. నోటుబుక్కు తీసిరాయి,

(గిరీశం చుట్టకాలుస్తూ మధ్య మధ్య చుట్టచేత పట్టి ఒక్కొక్క ముక్క చెప్పగా వెంకటేశం వ్రాయును.)

## THE WIDOW

She leaves her bed at A. M. four,
And sweeps the dust from off the floor,
And heaps it all behind the door,
The Widow !

Of wondrous size she makes the cake,
And takes much pains to boil and bake,
And eats it all without mistake,
The Widow !

Through fasts and feasts she keeps her health,
And pie on pie, she stores by stealth,
Till all the town talk of her wealth,
The Widow !

And now and then she takes a mate,
And lets the hair grow on her pate,
And cares a hang what people prate,
The Widow !

I love the widow——however she be,
Married again——or single free,

Bathing and praying,
Or frisking and playing,
A model of saintliness,
Or model of comeliness,
What were the earth,
But for her birth ?

The Widow !

యిది నేను రిఫార్మరులోకి అచ్చువేసేటప్పటికి టెన్నిసన్ చూసి గుండెకొట్టుకున్నాడు. (చుట్టతాగడం సమాప్తంచేసి) యింటికి పోదాంరా చాలా సేపైంది.

(నాలుగడుగులు యిద్దరూ నడిచే సరికి అగ్నిహోత్రావధాన్లు కలియును)

అగ్ని — ఏవండీ హనుమాన్లుగారూ—మీ పేరేవిటండీ !

గిరి—గిరీశం అంటారండి.

అగ్ని—అదుగో, గిరీశంగారూ రాత్రి మనవనుకున్న ప్రకారం మగడావాలు గెలుస్తాయనే మీ అభిప్రాయవా ?

గిరి—గెలవకపోతే నేను చెవికద పాయించుకు వెళ్ళిపోతాను. మీ వ్యాహాపోహాలు సామాన్యమైనవా ? అందులో "యతో ధర్మ స్తతో జయః" అన్నట్టు న్యాయం మీ పక్షం వుంది. బుచ్చమ్మగారి కేసు విషయమై జబ్బల్పూర్ హైకోర్టుజడ్జీ తీర్మానపాటి మనకి మహా బలంగా వుంది. మా పెత్తండ్రిగారు యిలాంటి కేసే ఒకటి యీమధ్య గెలిచారండి.

అగ్ని—దీని కల్లా అసాధ్యం యీకేసు కాకినాళ్ళో తేవల సొచ్చింది. మా కరటకశాస్త్రుల్లుని పంపిస్తే యక్కడో చవలవకీల్ని కుదిర్చాడు వాడెప్పుడూ డబ్బు తెమ్మని వ్రాయడవే గాని కేసుభోగట్టా యేమీరాయడు. గడియ గడియకీ వెళ్ళడానికం టె దూరాభారం గదా ?

గిరి—మీకళ్ళైతే స్టీమరుమీద నేను వెళ్ళి అవ్యవహారవంతా చక్కబెట్టుకు వస్తాను. మా పెత్తండ్రిగారు కాకినాడ కల్లా తెలివైన ప్లీడరు, ఆయన పట్టినకేసు యన్నడూ పోయిందన్నమాట లేదండి.

అగ్ని—మీరు వెళితే నేను వెళ్ళినట్టే. యంత ఫీజయినా మీ పెత్తండ్రిగారికే వకాల్తీ యిద్దాం. యేమంటారు ?

గిరి—మీదగ్గిర ఫీజు పుచ్చుకోవడం కూడానాండి ? ఖర్చులు మట్టుకు మీరు పెట్టుకుంటే, ఫీజుక్కర్లేకుండానే పనిచేయిస్తానండి.

అగ్ని—మీరలా అంటారన్నే నెరుగుదును. గాని గెలిచింతరవాత మనకి తోచిన బహుమతీ యిద్దాం.

గిరి—యిచ్చినానరె యివ్వకపోయినా సరేనండి

[ బుచ్చమ్మ ప్రవేశించును ]

బుచ్చమ్మ—నాన్నా అమ్మ స్నానానికి లెమ్మంచూంది.

అగ్ని—ఆలాగే. (బుచ్చమ్మ వెళ్ళిపోతూండగా గిరీశం కేగంటచూసును)

భోజనంచేసిన తరువాత కాయితాలు మీచేతికిస్తాను; అవన్నీ సావకాశంగా చూడండి మాయింటితూరు ప్పొరుగు రావాఁవుధాన్లుమీద మందడిగోడ విషయమై మనంతెచ్చిన దావా, లంచాఁపుచ్చుకుని మునసబు అన్యాయంగా కొట్టేశాడు. జడ్జీకోర్టులో అప్పీలు చేశాం; మా వకీలు అతవలపార్టీ దగ్గిరకతికి మన కేసు ధ్వంసం చేశాడు. మీవంటివారు నాకు చెయ్యాసరావుంటే రావాఁవుధాన్లు పిల కూడదీసేదును; కానిండిగాని తూర్పుమందడిగోడ రావాపుఁధాన్లి దయితే, పడవఁటి మందడిగోడ మందవాల్నా లేదా ? న్యాయం చెప్పండి. చూశండీ దానిమీద యెలా కొంజా యెత్తాడో ! క్రిమినల్నడిపించమని భుక్తసలహా చెప్పాడు

[ బుచ్చమ్మ ప్రవేశించును ]

బుచ్చ—నాన్నా ? అమ్మ స్నానం చెయ్యమంచూంది.

అగ్ని—వెధవముండా పోద ! పెద్ద మనుష్యుల్తో వ్యవహారం మాట్లాడుతూంటే రామాయణంలో పిడకల వేట్లాటలాగ అదే పిలవడవాఁ !

గిరీ—తప్పకుండా క్రిమినెల్కేసు తేవలసిందే, క్రిమినల్ ప్రొశీజ్యూర్ కోడు 171 శక్షను ప్రకారం తెద్దావాఁ ? 172డో శక్షను ప్రకారం తెద్దావాఁ ?

అగ్ని—రెండు శక్షన్లూ తేలేవేఁ ?

గిరీ—నేరంగలప్రవేశం, ఆక్రమణ—రెండు శక్షన్లూకూడ ఉపచరిస్తాయి నరేగదా కళ్ళతో చూశాను గనక యీ గోడ మీదయినట్టు జల్లితైగబొడిచి సాక్ష్యం కూడా వలగ్గలను యీగోడ స్పష్టంగా మీదా న్లాగే కనబడుతూంది.

అగ్ని—అందుకు సందేహం వుఁండండీ, యేమరచియున్నాళ్ళు వూరుకున్నాను. పెరటి గోడ కూడా చూతురుగాక్రనండి అక్కాబత్తుడిముక్కు నులిపి గెల్చుకున్నాను కాని యీ దావాల కింద సిరిపురంభూవిఁ అమ్మెయ్యవలసి వచ్చిందండి, రావాఁవధాన్లు కేసుకూడా గెలిస్తే, ఆ విచారం నాకు లేకపోవును.

(అందరు నిష్క్రమింతురు.)

—౯—

శ్రీ

# కన్యాశుల్కము



## తృతీయాంకము



౧-వ స్థలము. రామచంద్రపురం అగ్రహారంలో
రామప్పంతులు యింట్లో సావిట్లోగది.

[ మధురవాణి ప్రవేశించును ]

మధు — యీ రామప్పంతులు కథ పైకి పటారం, లోపల లొటారంలా కనిపిస్తూంది. భూములన్నీ తాకట్టుపడి వున్నాయిట; మరి రుణంకూడా పుట్టదట. వాళ్ళకీ వీళ్ళకీ జుట్టుముడేసి జీవనం చేస్తూన్నాడు, యీ వూరు వేగం శవిరించి చెయ్ చిక్కినంత సొమ్ము చిక్కించుకొని పెందరాళె మరోకొమ్మ పట్టుకోవాలి (పాడును) 'తెలియక మోసపోతినే, తెలియక' (పాడుచుండగా రామప్పంతులు ప్రవేశించును.)

రామ — యేవిటో ఆ మోసపోవడం ? తరవాత ముక్కేవిటి, పాడూ

మధు — తరవాత ముక్క లేదుండి. మిమ్మల్ని నమ్మి మోసపోయినాను,

రామ — అదేం అలా అంటున్నావు ? నిన్ను మోసపుచ్చలేదే ? నిర్ణయ ప్రకారం రెండొందలూ పట్నంలో యిచ్చాను. నెల జీతం నెలకు ముందే యిచ్చాను. యిహ మోస వేవుంది ?

మధు — యేం చిత్రంగా మాట్లాడతారు పంతులుగారూ. నాకు డబ్బే ప్రధానమైనట్టు మీ మనసుకి పొడగడుతూంది కాబోలు. నాకు డబ్బు గడ్డిపరక, మీ భూవులు రుణాక్రాంతమైనాయని అప్పట్లో నాకు తెలిసుంటే మీదగ్గిర రెండొందలూ పుచ్చుకొందునా ? మీరు ఖర్చు వెచ్చాలు తగ్గించుకుని సంసారం బాగుచేసుకోకపోతే నేను మాత్రం వొప్పేదాన్ని కాను. ఫలానా పంతులుగారు ఫలానా సాన్నుంచుకుని బాగుపడ్డారంటేనే నాకు ప్రతిష్ఠ. మా యింటి సాంప్రదాయం ఇది పంతులుగారూ, అంతేగాని లోకంలో సాన్లమచ్చని వూహించకండి.

రామ — భూవులు తణఖా అన్నమాట శుద్ధ అబద్ధం యెవరన్నారో గాని; నేను మహారాజులా వున్నాను,

మధు—నా కంటికి మహారాజులా కనపడబట్టే యిల్లూ వాకలీ వొదిలి మానం ప్రాణం మీపాలుచేసి నమ్మి మీవెంట వొచ్చాను. నన్ను మోసం మాత్రం చెయ్యకండీ; మిమ్మల్ని పాపం చుట్టుకుంటుంది.

రామ—నేను మోసం చేసే మనిషినేనా ?

మధు—అలాగయితే లుబ్ధావుధాన్లు గారికి పెళ్ళిందుకు కుదిర్చారు ? నాకు తెలియదనుకున్నారా యేవిఁటి ? ఆ ముసలాడికి పెళ్ళిందుకు ? మీ కోసవేఁ యీ యెత్తంతాను.

రామ—ఆహా ! హా ! హా ! యిదా అనుమానం ! కొంచం గెడ్డం నెరుస్తూంది. నన్ను కూడా ముసలాణ్ణంటావా యేవిఁటి ?

మధు—చట్లకి చావనలుపు, మనిషికి చావ తెలుపూ. అనగా చీకట్లో నక్షత్రాల్లాగ అక్కడక్కడ తెల్లవెంట్రుక తగిల్తేనే చమక్

రామ—స్వారస్యం మాచమత్కారంగా శెలవిచ్చావ్ ! యేదీ ముద్దు. (రామప్పంతులు మధురవాణిని ముద్దుబెట్టుకో బోవును,)

మధు—(చేతులతో అడ్డి ముఖము ఓరజేసుకొని) వేళాపాళా లేదా ? లుబ్ధావుధాన్లు పెళ్ళి తప్పించేస్తేగాని నేను ముద్దుబెట్టుకో నివ్వను.

రామ—అంతాసిద్ధమైఁది తరవాత. నా శక్యమా ఆపడానికి ? (బలాత్కారంగా ముద్దుబెట్టుకొనును,)

మధు—సత్తు వుందనా మోటతనం ?

రామ—నాసత్తువిఁప్పుడేం జూశావ్. చిన్నతనంలో ధ్వజస్తంభం దండతో కొడితే గణగణమని గంటలన్నీ ఒక గడియ వాగేవి,నాడు జబ్బుచేసిం దగ్గిర్నుంచీ డీలా అయిపోయినాను.

మధు—యిదా డీలా ? నా చెయి చూడండీ యలా కందిపోయిందో, అన్నా మోటతనం !

రామ—చావ చిరిగీనాచదరంతని. నీ ప్రాణానికి యిప్పటి సత్తువే ఉద్ఘోలం లా కనపడుతూంది.

మధు—యీ పెళ్ళి మాన్పించకపోతే నేను మీతో మాట్లాడను.

రామ—పెట్టికుదిరింది. రోకలి తలకి చుట్టమన్నాట్ట ! రెండేళ్ళాయి ఆ ముసలిగాడిద కొడుకుమీద నా శౌక్య ప్రజ్ఞంతా వినియోగపర్చి పెళ్ళిసిద్ధం చేసి యిప్పు డెలా తప్పించడం ?

మధు—యేం శౌక్యం చేశారు ?

రామ—అలా అడుగు. నా బుద్ధి సత్తువకూడ నీకు తెలుస్తుంది. లుబ్ధావుధాన్లు పరమలోభి వాడిగుణం యిలా వుండబోతుందని పోల్చారే మోఅన్నట్టు చిన్నతనంలో వాడికి పేరు పెట్టారు. పెళ్ళాడితే వొల్లనూల్లి ధనంవొస్తుందనిఆశ పెట్టించాను

మధు—యిలా చేశారి మహాచిత్రం? పెళ్లైతే శోభనం ఖర్చౌతుందిగాని, లావడ యేలాగ?

రామ—లౌక్యమంటే మరేమిఁ టనుకున్నావు? అసాధ్యాలు సాధ్యం, సాధ్యాలు అసాధ్యం చెయ్యడమేఁ కదూ? మన సిద్ధాంతిని దుర్వేటన్నటికి నాడేం జేశాడను కున్నావు? బుద్ధావుధాన్లు జాతకం యుగాదినాఁ చూసి శీఘ్రంలో వివాహ యోగం వుఁందన్నాడు. ఆవివాహంవల్ల ధనయోగం వుఁందన్నాడు. దాంతో మున లాడికి డబ్బొస్తుందన్న ఆశముందుకీ, డబ్బు ఖర్చౌతుందన్న భయం వెనక్కీలా గడం ఆరంభించింది. యింతట్లో పండాగారిక్కడి కొచ్చారు, ఆయన్ని కూడా తయారుచేశాను. బుద్ధావుధాన్లు అనుమానం తీర్చుకుందామని ఆయనికి జాతకం చూపించేసరికి పండాగారు యేమన్నారూ? "వివాహధనయోగాలు బలీలిగా వున్నాయి. అయితేమీరు పెద్దవాళ్ళు. యిప్పుడు మీకుపిల్ల నెవరిస్తారు. పెళ్లెలా అవుతుంది? యిలాంటివి జరగడానికి వీల్లేని మహాయోగాలు జాతకాల్లో పట్టిన ప్పుడు. గొప్పమేలుకు బదులుగా గొప్పకీడు సంభవిస్తుంది. అనగా మీకుమారకమో ధననష్టమో, సంభవిస్తుంది. గ్రహశాంతి చేసి బ్రాహ్మణ భోజనం బాహు ళ్యంగా చెయ్యండి. కొంత్త జపాల్ని గిబ్బోచేసి అంతటితో అరిష్టం పోతుంది. మంచిరోజు చూసి సూర్య నమస్కారాలు ఆరంభించండి'' అని చెప్పేసరికి అవు ధాన్లు గుండె రెండుచక్కలై వివాహప్రయత్నం ఆరంభించాడు. యిదీ కథ.

మధు యేమి కల్పన!

రామ—యింకా వుంది; యిహాను కృష్ణా రాయపురంలో అగ్నిహోత్రావుధాన్లు కూతురు జాతక మేలావుందట? చెప్పడానికి అలవిగాదు. అదికాలు పెట్టిన యిల్లు పది యిళ్ళౌతుందట. అదిపట్టిందల్లా బంగారమౌతుందట.

మధు—నిజమేనా లేక అదీ మీ బనాయింపేనా?

రామ—అదిమట్టుకు నా బనాయింపు కాదు, అగ్నిహోత్రావుధాన్లే జాతకం అలా బనాయించాడు. నూ బ్రాహ్మణ్ణల్లో యిది వరిసాఁటే, పెళ్ళిళ్ళలో పంపించేది ఒహ జాతకమూఁ నిజంవుండదు.

మధు—యేమోసం!

రామ—లౌక్యం, లౌక్యమను.

మధు—రెండింటికి యేమిటో భేదం.

రామ—నమ్మించోట చేస్తే మోసం, నమ్మించోట చేస్తే లౌక్యమూను.

మధు—తాను చేస్తే లౌక్యం, మరోడుచేస్తే మోసం అనరాదా? అబద్ధానికి అర్థమేఁ విఁటి?

రామ—యామన్నావూ? అబద్ధమనా? ఉద్యోగధర్మం లౌక్యవృత్తి అని. అది వక వృత్తి భగవంతుడు కల్పించాడు. ఆలౌక్యవృత్తి యెటువంటిది? నిజాన్ని పోలిన అబద్ధాండి ద్రవ్యాకర్షణచేసేది, యీధర్మ సూక్ష్మాలు నీకెలా తెల్లు స్తాయి.

మధు—నాకెలా తెలుస్తాయి నిజవేఁగాని ద్రవ్యాకర్షణ యెలాగ యీ పెళ్ళివల్ల
రామ—(తనలో) క్రాసెగ్జామినేషను చేస్తూందోయి. దీంతస్సా గొయ్యా (పైకి)
నీకు మేజువాణి నిర్నయించుకున్నాను కానూ, నీకు పదిరూపాయలనానూ
దొరకడం ద్రవ్యాకర్షణ కాదా!
మధు—యేం చిత్రమైన మనుష్యులు పంతులుగారూ! (తమలపాకు చుట్టతో కొట్టి
నేను రాబోతానని రెండేళ్ళ కిందట కలగని, యీ కాబోయే మేజువా
బుద్ధిలో వుంచుకుని యీ పెళ్ళి కావడానికి విశ్వప్రయత్నం చేశారూ? ద్రవ
కర్షణ యెలాగో నాకు బోధపడ్డది. పెళ్ళికూతుర్ని యిలా కాచేసుకుని, —
ద్వారా మునలాడి మూటా ముళ్ళా లాగేస్తారు. యెంతసత్యకాల సదా
యినా అమాత్రం ఊహించుకోగల్ను. లేకపోతే నేయంత బతిమాలుకునా
యీ పెళ్ళి తప్పించకపోవడవేఁవిఁ? మీబుద్ధికి అసాధ్యం వుందంటే నమ్
తానా?
రామ—అమాట్నిజవేఁగాని, అన్నిపనులూ ద్రవ్యాకర్షణ కోసవేఁ చాస్తాననుకున్నా
వా యేవిఁటి, ఆమునలాణ్ణి కాపాడదావఁనే, యీ పెళ్ళితల పెట్టాను.
మధు—"చిత్రం చిత్రం మహాచిత్రం" అని కథుంది. అలావున్నాయి మీచర్యలు!
రామ—ఆ కథేదో చెబుదూ, నాక్కథలంటే మాసరదా.
మధు—పొగటిపూట కథలేవిఁటి, ముందు యీ చిత్ర కథేవిఁటో తెలవియ్యండి.
రామ—అది చెప్పేదికాదు. చెప్పను.
మధు—చెప్పకపోతె వొప్పను.
రామ—ఒప్పకేం జేస్తావు?
మధు—యేం జేస్తానా? యీ జడతో కొడతాను, శాస్త్రంలో కాముకులకు చెప్పి
అయుధవిఁది.
రామ—నేను దెబ్బలికి మనిషినికాను. శాస్త్రం గీస్త్రం వొక పక్కనుంచి మో
సరసం మాను. చెప్పమంటే చెబుతాను గాని అలాంటికబుర్లు నువ్వు
కూడదు. మరేంలేదు. లుబ్ధావుధాన్లు వెధవకూతురు, మీనాక్షి ప్రవ
మంచిదికాదు. నాల్రోజుల కోమామారు అది పీకలమీదికి తెస్తూంటుంది పో
వాళ్ళు బెదిరించి పదిడబ్బులనొమ్ము లాగేస్తూంటారు. డబ్బు ఖర్చంటే ము
లాడికి, ప్రాణపోకట, సంసారంకూడా మీనాక్షి దూబర చేస్తుందంటాడ
పెళ్ళయితె దాని ఆట కడుతుంది.
మధు—మీనాక్షి ప్రవర్తన బాగుంది కాదంటూ మీరేచెప్పాలి? మీరు కంట
తరవాత యే ఆడదాని ప్రవర్తన తిన్నగా వుంటుంది?
రామ—అదుగో చూశావా? అలా అంటావనే కదూ చప్పనన్నాను.
మధు—యీ చిక్కులు నాకేం తెలియవు. పెళ్ళి మానిపించెయ్యండి.

రామ—యీ పెళ్ళిలో నీ మేజువాణీ పెట్టి పదిరాళ్ళిప్పిస్తాను మాట్లాడ కూరుకో.
మధు—(ముక్కుమీద వేలుంచుకొని) బుద్ధిపూర్వకాన్లు యిదట నేను మేజువాణీ ఆఁ!
రామ—పేరువాడుగాని, సభలో పెద్దన్న నేకదూ?

[ హెడ్ కనిస్టేబ్ చుట్టకాలుస్తూ ప్రవేశించి కుర్చీమీద కూర్చొనును]

హెడ్—రామప్పంతులూ! యినస్పెక్టరికే టోపి వేశావటే?
రామ—(హెడ్ కనిస్టేబు చెవిలో) గారూ గారూ అనవయ్యా.
హెడ్—యెప్పుడూ లేంది గారేవింటి, గీరేవింటి, చింతగారు?
రామ—ఆడవాళ్ళున్న చోటికి తోసుకు రావడవేఁనా, అన్నా!
హెడ్—ఆడవాళ్ళుంటున్నావు. నువ్వు కూడా అందులోనే జమాయేవింటి? అహా! హా!
రామ—హాస్యానికి వేళాపాళా వుండాలి.
హెడ్—నేను హాస్యంకోసం రాలేదు; యినస్పెక్టరు పేరు చెప్పి రావిఁనాయుడి దగ్గిర పాతిక రూపా యల్లాగావట, యిలా యందరిదగ్గిర లాగాడో రామప్పంతుల్ని నిబ్బున్న పాట్లాన్ని పిలకట్టుకు యీడ్చుకురా అని నాతో ఖచితంగా చెప్పి యినస్పెక్టరు పాలెం వెళ్ళిపోయినాడు.
రామ—చిన్నప్పుడు వొక్కబళ్లో చదువుకున్నాం యినస్పెక్టరూ నేనూను. అంచాత అతని పిలక నేనూ నాపిలక అతనూ లాగినా ఫర్వాలేదు. రావిఁనాయడి మాటమాత్రం శుద్ధాబద్ధం. మీరు ముందు పదండి, గుఱ్ఱం కట్టించుకుని స్టేషను దగ్గిర కలుస్తాను.
హెడ్—నే నెలావొస్తాను నీతోటి; నాకు వొల్లిమాలిన్నపనుంది. ఒక కనిష్టీబుని నీతో వంపిస్తాను.
రామ—(హెడ్ చెవులో) నాయింట్లో మాత్రం నకార ప్రయోగం చెయ్యకు, నీ పుణ్యం వుంటుంది.
హెడ్—అదా నీభోప! అలా క్కానియి. (నిష్క్రమించును.)
రామ—(తనలో) అదుగో మళ్ళీ ఏకవచనవేఁ కూస్తాడు! (పైకి) యవఁడ్రా అక్కడ.
నౌఖ—(ప్రవేశించి) సిత్తంబాబు.
రామ—గుఱ్ఱం కట్టమను.
నౌఖ—సిత్తం బాబు. (నిష్క్రమించును.)
రామ—చూశావూ మధురవాణీ నేన్నిలబడ్డచోట రూపాయలు గలగల్రాల్తాయి, యీ యినస్పెక్టరుగాడికి యీ తాలూకాకి వొచ్చింతరవాత అయిదారువేలు యిప్పించాను. పీధి తలుపు వేసుకుని, సంగీతసాధకం చేసుకో, విద్యవంటి వస్తువులేదు. (గుమ్మందాటి నాలుగడుగులు వెళ్ళి తిరిగివచ్చి) అప్పుడే వీధి

తీసావు ! యీవూళ్లో మాదుర్మార్గులున్నారు; నా స్నేహితులవనీ, బంధువులవనీ పేరు పెట్టుకొస్తారు. రానీకుమా (తలుపు వైవించి వేసి) గడియ వేసుకో. (నిష్క్రమించును.)

## ౨-వ స్థలము, రామప్పంతులుయింట్లో పడకగది.

[మధురవాణి తివాసీమీద కూచుని వీణ వాయించుచుండును వాయిద్యం ముగించి]

మధు—విద్యవంటి వస్తువలేదు, నిజమే—ఒక్కటితప్ప—అదేవిఁటి ? విత్తం. డబ్బురానివిద్య దారిద్ర్యహేతువ. యీవూళ్లో నారదుడువొచ్చి పాడితే నాలుగు దమ్మిడీలివ్వరు, గనక యీవీణ యిటు పెడదాం. పొద్దు కనిస్తేబు సౌజ్ఞచేసి వెళ్ళాడు. అతడు యిచ్చేది చచ్చేది లేదుగాని, జటీలేవైఁనా వొస్తే ఓ వొడు కాసాడు.

(వీధి తలుపు తట్టబడును)

వొచ్చాడు కాబోలు. (తలుపుదగ్గిరకివచ్చి) యెవరు మీరు ? బంధువులా ?

(తలుపవతల కరటకశాస్త్రుల్లు, కన్యవేషంతో శిష్యుడున్నూ.)

కర—ఆపద కడ్డం బడ్డవారే బంధువులు. మేమ్మీకు బంధువులం కావుఁగాని, మీరు మాకు బంధువులు కాగల్రు.

మధు—నేస్తులా ?

కర—(తనలో) యీ కంఠం విన్నట్టుంది (పైకి) నేస్తం కట్టడానికే వొచ్చాం.
మధు—దేంతో కడతారు ?
కర—(తనలో) యీ వేశ్య మధురవాణి కాదుగద ? కంఠాన్ని పోలిన కంఠం వుండకూడదా ? (పైకి) నేస్తం కట్టడానికలా వున్నది వక్కటేగదా టంకం ?
మధు—యేమిటో ఆ టంకం ?
కర—బంగారం !

మధు—మా పంతులుగారికి మీరు నేస్తులూ, బంధువులూ కూడా కాకపోతే తలుపు తియ్యొచ్చును. (తలుపు తియ్యును.)
కర—(తనలో) అరే ! మధురవాణే !
మధు—(ముక్కుమీద వేలుంచుకొని) చిత్రం !
కర—యేమిటి చిత్రం ?

మధు—యీ వేషం!
కర—ఉదరనిమిత్తం బహుకృతవేషం; యిది దేవుఁడిచ్చిన వేషవేఁను.
మధు—నాదగ్గిరేనా మర్మం? యీ పిల్లెవరో?
కర—నా కొమార్త.
మధు—నాటకవఁల్లా చెటి పొగటివేషాల్లో దిగిందా? పెట్టి పుట్టారుగదా యేల యీ అవస్థ?
కర—నీదయవల్ల దేవుడిచ్చిన స్థితికేం లోపంరాలేదు. నిన్ను చూదావఁని వొచ్చాను.
మధు—యిన్నాళ్ళకైనా యీ దీనురాలు మీకు జ్ఞాపకంరావడం అదెంతగాదు?
కర—నీలాంటి మనిషి మళ్ళీ వుందా? నిన్ను చూడ్డం బ్రహ్మానందం కాదా? నీ దగ్గిరకి రావడం, చేదనా యిన్నాళ్ళూ రాలేదనుకున్నావు? డిప్టీ కలక్టరుగారి కుమార్రత్నంగారు నిన్ను చేపట్టారని తండ్రికి తెలిసింతరవాత, నేనుగానీ నీ యింటికి వొస్తే పీక ఉత్తరిం చేస్తాడేమో అనే భయంచాత కొంచ యడబెట్టి యితడికి యెప్పుడు బదిలీ అవుతుంది, మా మధురవాణ్ణి యెప్పుడు చూస్తాను అని దేవుఁణ్ణి సదాప్రార్థిస్తూ వుంటిని. నువ్వికక్క డెన్నాళ్ళాయి వున్నావు?
మధు—డిప్టీకలక్టరుగారి కుమార్రత్నంగార్ని, తండ్రి, చదువుపేరు పెట్టి చన్నపట్నం తగిలిన రెండు నెల్లదాకా అయననేస్తుడు గిరీశంగారి ద్వారా డబ్బు పంపించాడు. ఆతరవాత మొన్నటిదాకా గిరీశంగారు నన్ను వుంచారుగాని, డబ్బుకి యటామటీగా వుండేది. నాయింటికి వొచ్చిన వాడల్లా తనకొడుక్కి దోస్తి అయివుంటాడని డిప్టీ కలక్టరు అనుమానిస్తాడేమో అని పేరు గలవాడెవడూ నా యింటికి రావడం మానేశాడు. సంజీవరావుగారి అల్లరి కొంచం మరుపొచ్చిందాకా పైనుందావఁని యీ వూరొచ్చాను.
కర—(ముక్కుమీద వేలుంచుకొని) గిరీశం నిన్నుంచుకున్నాడా? మా మేనల్లుడికి చదువు చెప్పడానిక్కుదురుకుని మావాళ్లింట్లో చేరాడు. వాడికి ఫెందరాళే ఉద్వాసన చప్పాలి.
మధు—(ముక్కుమీద వేలుంచుకొని) నాదగ్గిరకు వచ్చినవాడల్లా చెడిపోయినాడో? నాదగ్గిరకు మీరు రాకుండా అవరోధం కలిగిందని యిప్పుడే డిప్టీ కలక్టరుగార్ని తిట్టారే. అయనకంటె మీన్యాయం యేంబాగావుంది? నా దగ్గిరకు వచ్చినందుకు, మీ భార్యాగారు ముందు మిమ్మల్ని మెడబట్టుకొని యింట్లోంచి తరవ్వఁలిసింది. తనకిరొట్టా, ఒకడికి ముక్కానా?

కర—క్రియలలో అంతవరకూ జరక్కపోయినా మాటల్లో అమర్యాద అమేషా నాకు జరుగుతూనే వున్నది.

మధు—(చిరునవ్వుతో) యీయిల్లాలు మాపంతులు కంటబడితే యీవిడ గుట్టుబట్ట బయలౌతుంది.

కర—యిల్లాలనేస్తున్నావేం అప్పుడేను? కన్నెపిల్ల; దీన్ని పెండ్లి చేయడానికే, నీదగ్గిరికి తీసుకొచ్చాను.

మధు—మావంతులుకేనా పెళ్ళి?

కర—"ఏకానాకి సుందరీహావకీవా," అన్నాడు. త్రిలోకసుందరివి నువ్వు దొరికిం తరవాత నీ పంతులుగారికి యింకా పెళ్ళెందుకు?

మధు—ఐతే మరెవరికి పెళ్ళిచెయ్యం? నాకా యేవిటి? ఆలాగైతే, సైయే! మొగవేషం వేసుకొని, పెళ్ళిపీటలమీద కూర్చుంటాను. యిలాంటి పెళ్లాం దొరకడ వెలాగ? జగత్ప్రసిద్ధులైన కరటకశాస్త్రుల్లుగారి అల్లుణ్ణి కావడం యెలాగ? దివ్యసుందర విగ్రహావని పొగడగానే నాబుజాలు పొంగుతా యనుకున్నారు కాబోలు? యీపిల్లదగ్గిర నాబోట్లు దివిటీముందర దీపాలు. ఆడది మెచ్చిందే అందం! మొగాడి కన్ను మనక. మీకేం తెలుసును? మరి నా పెళ్ళాన్ని నాకిచ్చేసి మీతోవని మీరు వెళ్ళండి, (శిష్యుడి చెయిపట్టిలాగును)

శిష్యు—చూశావుదా నాన్నా యలా పట్టుకుందో?

మధు—(ఆపుకోలేకుండా నవ్వుతూ) శ్భాభాషు! యిదేనా పెద్దమనిషి తరహా! యిరుగుపొరుగమ్మ లేవంటారో మొగుడు పిలిస్తే వెళ్ళకుంటేను?

శిష్యు—కొడుతుంది కాబోలు నాన్నా, యింటి కెళ్ళిపోదాం, రా!

మధు—యేంనంగ నాచివే? తరవాత పెళ్ళిచేసుకుంటాను, అందాకా ముద్దియ్యి (ముద్దెట్టుకొనును.)

కర—నేరని పిల్లని చెడగొడుతున్నావు.

మధు—నాలాంటి వాళ్ళకి నూరుమందికి నేర్పి చెడగొట్టగలడు. యవరిశిష్యుడు? యీకన్నపిల్ల నోరు కొంచం చుట్టవాసన కొడుతూంది!

కర—అంచాతే కాబోలు డబ్బీలో చుట్టలు తరుచు మాయ మౌతూంటాయి. మధుర వాణి! దేవుణ్ణాకు నిన్ను చూపించాడు పంతుల్లేని సమయం కనిపెట్టి వొచ్చాను; మళ్లీ అతడొచ్చేలోగా నామాటలు నాలుగూవిని మాకు వొచ్చిన చిక్కు తప్పించు.

మధు—మీకొచ్చిన చిక్కేవిటి? నేం చెయ్యగలిగిన సహాయ వేవిటి?

కర—చిక్కన్నా చిక్కు కాదు. విను, యీవూళ్లో గిరీశం పెత్తల్లికొడుకు బుద్ధావు ధాన్లని ఓ ముసలాడున్నాడు; వాడికి నా మేనగోడల్ని వ్వడానికి మాబావ

నిశ్చయించాడు. యీ సంబంధం చేస్తే నా చెల్లెలు నూతులో పడతానని వొట్టేసు
కుంది. యేం వుపాయం చూస్తావో, దాని ప్రాణం కాపాడాలి.

మధు—యీపిల్లని అంతకి తక్కువ సొమ్ముకి అమ్మితే, లుబ్ధావధాన్లు చంకలు గుద్దు
కుని చేసుకుంటాడు. అతనిదాకా యెందుకు నేనే కొనుక్కుంటాను.

కర—చూపితే అందుకుపోయేదానికి నీకు మిక్కిలి చెప్పాలా యేవిఁటి?

మధు—యిదివరకి నిర్ణయమైన సమ్మంధం యేమ్మిష పెట్టి తప్పించడం?

కర—నీబుద్ధి కసాధ్యం వుందా? డబ్బు కసాధ్యం వుఁదా?

మధు—బుద్ధికి అంతా అసాధ్యవేఁగాని, డబ్బుకి యక్కడా అసాధ్యంలేదు. యీ
పెళ్ళిలో మావంతులుకో పదిరాళ్ళు దొరుకుతా యనుకుంటున్నాడే?

కర—నాసంబంధం చేసుకుంటే నేను యిరవై రాపాషాణాలు యిస్తాను,

మధు—సరే గాని నాటకంలో యంతహాస్యమైనా చెల్లుతుంది. నటనలోకి హాస్యం
తెస్తే యేవిఁ మూడుతుందో ఆలోచించారా?

కర—మధ్య నీకొచ్చిన పర్వా యేవిఁటి? నాకొచ్చిన ఫర్వాయేవిఁటి? యీకత్తెర మీసం,
కత్తెర గెడ్డం కడిగేసుకుని నాతోవని నే వెళతాను. యీకోక నీసగ్గిర పాఁరేసి
మాశిష్యుడు వెళతాడు. ఆతరవాత యిదేవిఁటమ్మా యీ చిత్రవఁని నువ్వా
నలుగురమ్మలక్కలతో పాటు ఆశ్చర్యపడుదువుగాని, మీపంతులుతో సిఫార్సుచేసి
యీ మంత్రం యలా సాగిస్తావో గట్టి ఆలోచనచెయ్యి.

మధు—మాపంతులు వక్కడివల్లా యీపని కానేరదు.

కర—మరియింకా యవరికాళ్ళు పట్టుకోవాలో చెప్పు?

మధు—మాపంతులుతో మాట్లాడం ఐనతరవాత అవుధాన్లు కూటురు మానాస్తం
మీనాక్షిని తండ్రికి తెలియకుండా చూసి, ఓ రెండు పెద్దకాసులు యిస్తానని
చెప్పండి. ఆపైని సిద్ధాంతిని చూసి అతనికీ అలాగే ఆశపెట్టండి. యీ పనికి
సిద్ధాంతే కీలకం. నేను తెరవెనకనుంచి సమయోచితంగా హెంగుచాస్తాను.

కర—నీమాటవెరే నే చెప్పాలా? నిన్ను సంతోషపెట్టడం నాకు విధి.

మధు—ఆమాట మీరు శలవివ్వడం నాకు విచారంగావుంది. వృత్తిచేత వేశ్యని
గనక చెయ్యవలసినచోట్ల ద్రవ్యాకర్షణ చేస్తానుగాని, మధురవాణికి దయా
దాక్షిణ్యాలు సున్నఅని తలచారా? మీతోడబుట్టుకి ప్రమాదం వొచ్చినప్పుడు
నేను డబ్బుకి ఆశిస్తానా? యటుంచి యెటొచ్చినా కాపాడతాడు, పెద్దు
కన్నిషేబుకుమాత్రం కొంత నిజంచెపుదాం. అతగాడు యిప్పుడే వస్తాడు,
మాట్టాడతాను, మీరు యిక్కడ కూచోండి,

కర—స్వాధీనుడేనా? కొంప ముంచడుగద?

మధు—గులాం. (నిష్క్రమించును.)

కర—కూచుందాం రా.

శిష్యు—నాపే రేవిటండోయి ?

కర—కొంపముంచుతావు కాబోలు! సుబ్బి! సుబ్బి! మధురవాణ్ణి చూడగానే మతి పోయిందా యేవిటి?

శిష్యు—దాని నవ్వు పట్టుబడాలని నిదానిస్తున్నాను.

కర—సబ్బు అన్నమాట జ్ఞాపకం వుంచుకుంటే సుబ్బిఅనే పేరు జ్ఞాపకం వుంటుంది.

(రామప్పంతులు గుఱ్ఱందూరాన్నదిగి నడిచివచ్చి)

రామ—(కరటకశాస్త్రితో మెల్లిగా) లోపలికెవరైనా వెళ్ళారా ?

కర—(గట్టిగా) యవరో యిద్దరు ముగ్గు రొచ్చారుగాని మీయిల్లాలుగారొచ్చి పైకి పొమ్మని గెంటేశారు.

రామ—మీరెవరు ? యెందుకొచ్చారు ?

కర—మాది కృష్ణాతీరం. నాపేరు గుంటూరుశాస్త్రుల్లంటారు. తమదగ్గిర రాచకార్యవుండి వొచ్చానండి.

వీధిలోనుంచి జవాను—"యినస్పెకటరుగారు నే వొచ్చిందాకా మఱ్ఱిచెట్టు కింద గుఱ్ఱాన్ని నిలబెట్టుంచుతావన్నారు. రూపాయలు వేగం యివ్వండి."

[మధురవాణి ప్రవేశించును]

రామ—యవరు వొచ్చారట ?

మధు—యవరొస్తారు ? మీ నాస్తులట! తగిలాను.

జవా—రూపాయలండోయి.

రామ—(మధురవాణితో) యేదీ మొన్న నీకిచ్చిన రూపాయలు ? సాయింత్రం మళ్ళీ ఫిరాయిస్తాను. యీసైతాను ప్రాణం తింటున్నాడు.

మధు—మీరిచ్చిన రూపాయలు పట్టంతో లేశాను. నేను డబ్బిక్కడ దాచుకుంటే మా తల్లక్కడ కాలక్షేపం చెయ్యాడవెలాగ ?

రామ—వొట్టబద్ధాలు !

మధు—(తాళములగుత్తి మొలలోనుంచితీసి రామప్పంతులుమీద విసిరి) చూసుకోండి

రామ—(బుజం తడువుకుంటూ) దురహంకారం కూడదు! విసిరికొడితే దెబ్బ తగల్దనుకున్నావా యేవిటి ?

మధు—దుష్టుమాటలనగా తగిల్తే తప్పా ?

జవా—యేటండోయి, పోయి, రూపాయి లిచ్చావుకావని యినస్పెక్టరుగారితో చెబుదునా ?

మధు—(మెడలో గొలుసుతీసి) యిది తాకట్టువుంచి కావలసినసొమ్ము తెచ్చుకోండి.

రామ—(తనలో) ఆహా! యేమి సౌభాగ్యమైనమనిషి! యెప్పటికీ అనుమానాలు పడ కూడదు!

కర—పంతులుగారూ యెన్నిరూపాయలు కావాలండి?

రామ—పాతిక.

కర—నే దాఖల్చేస్తాను. (జవానుకు యిచ్చును)

రామ—ధనజాతకానికి దబ్బులా వొస్తూంవుంటుంది యేవిఁటి మీరాచకార్యం?

కర—యిది నాపిల్లండి, దీనికి వివాహాం చేయించి అనుకృతం తమరు కట్టుకోవాలి.

రామ—వివాహాం చేయించడానికి నేను వైదీకిని కాను. నాకు మంత్రాలు రావే? (చుట్ట, జేబులోంచితీసి కొన కొరికి) యేవఁంటావు మధురవాణి? అగ్గిపుల్ల.

మధు—(అగ్గిపుల్ల అందిస్తూ పంతులునుంచి శిష్యుడివేపూ, శిష్యుడినుంచి పంతులువేపూ కోపముతో చూసును)

కర—మంత్రవఁన్నప్పుడు వైదీకపవాడిదేం మంత్రవఁండి? యీ రోజుల్లో వైదీక మంత్రాల మహిమ పోయిందండి. మంత్రవఁంటే నియ్యోగ ప్రభువుదే మంత్రం తమవంటి ప్రయోజకులకు మంత్రం మాటాడుతుందండి.

రామ—మధురం! యేవఁంటావు? యీపిల్లన్నే పెళ్ళిచేసుకుందునా?

మధు—(రామప్పంతులు వేపూ శిష్యుడివేపూ చురచుర చూసి నిష్క్రమించును.)

రామ—సొగసుకత్తెలకి అలకకూడా అదో శృంగారం సుమండీ, శాస్తుల్లుగారూ!

కర—వైదీకపాళ్ళం మాకా శృంగారాలు యలా అనుభవవౌతాయండి? మాయి ల్లాళ్ళకోక్కపంవస్తే చీపురుగట్టలు యెగురుతాయండి. సరసవఁన్నది పుస్తకాల్లో చదవడవేఁగాని మాకు అనుభవవేద్యం కాదండి. శ్రీకృష్ణమూర్తివారు రాధి కతో కలవిస్తున్నారు, ఓ రాధికా నీకోపం తీర్చుకోవాలన్న ష్టాయనా "ఘటయ భుజబంధనం రచయ రద ఖండనం, యేనవాభవతి సుఖజాలం" అనగా యేవఁం చున్నాఁరంటే కవీశ్వరుడు, చేతుల్తోటి ఉక్కిరి బిక్కిరి అయ్యేటట్టుగా కౌగలిం చుకో, మరిన్ని పెదివఁలు రక్తాలోచ్చేట్టు కొరికెయ్యి. అంటున్నాడు.

రామ—(మధురవాణి వెళ్ళినగుమ్మమువేపు చూసి) ఉష్షులేకనే ముప్పందుం. మధుర వాణికి మాత్రం యీ వెఱ్ఱి మొఱ్ఱి కవిత్వాలు చెప్పకండి. వాలాంటి మృదువర్లు మోటసరసం సహించరు.

కర—ఆమె మీభార్యా కాదండి? సంసారికన్నా మర్యాదగావుంది యీవేళ్ళ! మీది యేవఁదృష్టం.

రామ—యొంపిక, యొంపికలోవుందండి, మీరాచకార్యం చెప్పారుకారు.

కర—లుబ్ధావుధాన్లుగారికీ తమకీ చాలా స్నేహవఁని విన్నాను. ఆయన తమమాట అడుగు దాటరట?

రామ—ఆగాడిదకొడుక్కి ఒకరితో స్నేహం యేమిటండీ? వాడి ప్రాణానికి డబ్బు కీలంకి, డబ్బుకీ వాడికీ స్నేహంగాని మరి యెవరితోనూ స్నేహంలేదు. అయితే వాడికి వ్యవహారజ్ఞానం లేకపోవడంచాతా, కోర్టులంటే భయంచాతా, నాసలహా లేక బతకలేడు, వాడే అన్నమాటేవిఁటి, యీతాలూకాలో సివిలు మేజస్ట్రేట్లు యెక్కడో? రామప్పంతులు పప్పులేని పులగం వుండదు.

కర—ఆమాటవినే తాము నియ్యోగ ప్రభువులు, మంత్రబలంచాత చక్రం అడ్డేస్తారని తమర్ని వెతుక్కొచ్చాను. మాపింతల్లికొడుకు బియ్యే బియ్యేల్ పాసయినాడండి. డిప్టీకలక్టరీ చేస్తున్నాడు. బంధువులకి అతనివల్ల గడ్డిపరకంత సాయం లేదుగదా? మీదిమిక్కిలి కూరానారా యెవళ్ళయినా గృహస్థులు గృహస్థు మర్యాదకి పంపించి, తల్లయినా పెళ్ళాంఅయినా అవి పుచ్చుకుంటే, తిరగ గొట్టిందాకా అభోజనం కూచుంటాడు! పెట్టడానికి పుచ్చుకోవడానికీ నియ్యోగప్రభువులు తమకి చెల్లిందిగాని, మావాళ్ళ ఉద్యోగాలు మంటిగడ్డ ఉద్యోగాలండి, "ఇయ్యా ఇప్పించంగల అయ్యలకేగాని మీసమన్యలకేలా రెయ్యకీ లేవా బారెడు" అని కవీశ్వరుడన్నాడు.

రామ—యీ యింగిలీషు చదువులు లావైనకొద్దీ వైదీకులే అన్నమాటేవిఁటి అడ్డమైన జాతులవాళ్ళకీ ఉద్యోగాలవుతున్నాయి గాని యెంత చదువుకున్నా మీ వైదీకప్పంతుళ్ళవారికి మాచాకచక్యాలబ్బుతాయండీ? మా లౌక్యం మాతో స్వతహాగా పుట్టినది మీరు తెచ్చిపెట్టుకున్నది. యెరువుసరుకు యెరువుసరుకే. విన్నారా? మీవాళ్లు లంచాలు పుచ్చుకోవడం చాతకాక, పతివ్రతలమని వేషం వేస్తారు.

కర—అదేవతకవైఁతే అది అమ్మకు బతకనాఁ అన్నట్టు మావాళ్లకే చాతయితే నాకు యీ అవస్థేవండి? మావాడు పదిమంది పాటీలతో చెబితే పదిరాళ్ళ సొమ్ము దొరుకును. యీచిక్కులు లేక పోవును.

రామ—యెవిఁటా చిక్కులు?

కర—రుణబాధ చాలా లావుగా వుందండి. రేపటి పున్నంలోగా ఒక దస్తావేజు తాలూకు రూపాయలు చెల్లకపోతే దావాపడిపోతుందండి. యీపిల్లని నల్లబిల్లిలో వెంకటదీక్షితులుగారికి పదహారు వందలకి అమ్మ నిశ్చయించుకొని తీరా వొచ్చేసరికి యిప్పట్లో రూపాయలివ్వలేం, పెళ్లయిన నెల రోజుల్లో యిస్తావఁన్నారండి, అందుచేత అది వొదులుకొని లుబ్ధావుధాన్లుగారు వివాహప్రయత్నంలో వున్నారనివిని తమ దర్శనానికి వొచ్చానండి. యిదిగాని తాము సమకూరుస్తే పదివరహాల సొమ్ము దాఖలు చేసుకుంటాను.

రామ—నేను నలభై యాభై రూపాయల వ్యవహారాల్లో జోరబడేవాణ్ణి కాను.

కర—తాముచేసే సదుపాయాన్ని బట్టి యెంతయినా దాఖలుచేసేవాణ్ణేనండి నా రుణాలు పదహారు వందలుంటాయండి. ఆపైని యెవొచ్చినా తాము దాఖలు చేసుకోండి.

రామ—"ఐతే, గియ్తే" బేరాలు మాకవసరం లేదు, అగ్నిహోత్రావుధాన్లకి ద్ధెని మిది వొందలిస్తున్నాడుగదా, అందుకు సగానికి సగం తగ్గితేనేగాని అవుధాన్లు ఆ సంబంధం మాని మీ సంబంధం చేసుకోడు అందులో మీ రుణాలు తీరే దేవిఁటి నాకిచ్చేదేవిఁటి ? యేమైఁతేనేవిఁ? ఆ వ్యవహారం బాగా మించి పోయింది. పదిరోజులకిందటొస్తే ఘొక్తుపరుస్తును. ఆ సంబంధం ఘోగట్టా మొదట నేనే తెచ్చాను నా చేతుల్లోంచి ఆ వ్యవహారం పోలిశెట్టిలాగేశాడు. కృత్యాద్యవస్థమీద మధురవాణి మేజువాణికి వాయిదా వేయించేసరికి నా తాతలు దిగొచ్చారు. మరివక ఉపాయం చెబుతాను వినండి. మీకు మయినరు కొమా ళ్లున్నారా ?

కర—చిన్నవాడికి మయినారిటీ దాటి మూడేళ్ళయిందండి

రామ—అయితే యిహలేం దేవిఁటి ? ఆ కుఱ్ఱవాడు మయినరని వాదిద్దాం.

కర—సాక్ష్యం యలావొస్తుందండి ?

రామ—ఓ హో హో! మీకు యేమీ తెలియదే! యిలాంటి వ్యవహారాలు నా తలమీద యెన్ని వెంట్రుకలున్నాయో అన్ని మోసేశాం, విన్నారా ? ఉర్లాం బసవరాజుగారి సంభావన్లరేటే సాక్ష్యాలక్కూడా గెజటొడ్డర్ చేశాం. కుండ నాలు వేసుకున్నవారికి ఓ రూపాయి జాస్తా.

కర—జాతకంవుందిగదా యేంసాధనం ?

రామ—కాకితమైఁతే అగ్గిపుల్లతో ఫైసల్! తాటాకైతే నీళ్ళపాయ్యి! కొత్తజాతకం బనాయించడం అయిదు నిమిషాలు పని. మా సిద్ధాంతిమట్టుకు నాలుక్కా లాలు చల్లగావుండాలి. నాదగ్గిర పాతతాటాకులు అలేఖాలు అటకనిండా వున్నాయి. ముప్ఫైయేళ్లనాటి కాకితాలున్నాయి. రకరకాలు సిరాలు న్నాయి. ఒక నూఱ్ఱూపాయిలు నాకు ఫీజుకింద యిచ్చి ఖర్చులు పెట్టుకోండి. గ్రంథం నడిపిస్తాను.

కర—దారి ఖర్చుకోసం తెచ్చిన రూపాయలు మీకు దాఖలుచేశాను. మరి బుర్ర గొరిగించుకుందావఁంటె దమ్మిడీలేదు. కోట్లచుట్టూ తిరగడానికయినా చేతిలో ఓడబ్బు సొమ్ముండాలిగదా ? యిదొహాత్తే టొంపలా నాతోవుంటే యలా గండి కోటచుట్టూ తిరగడం ? తమ సౌఖ్యానికి అసాధ్యవఁన్నది వుంటుందంటే నేనమ్మజాలను. యలాగయినా కుదిరిన్న సంబంధం తప్పించి, మాసంబంధం కుదిరి నాకు యిచ్చే సొమ్ములో పదోవంతు తాము అంగీకరించి మిగిలింది

నాకు దయచెయ్యండి దీన్ని మొగుడింట అప్పజెప్పి ఆపైన యీ గ్రంథం యేదో కొంత చూసిందాకా తమర్ని అంటగాగి వుంటాను.

రామ—పదోవొంతు పనికిరాదు. మా బేరం యెప్పుడూ సగానికి సగం.

కర—సంగోరు మీకిస్తే మరి నేను రుణాలేం తీర్చుకోను ?

రామ—రుణాల్తీర్చుకో అఖర్లేకుండా గ్రంథం జరిగిస్తాంకదూ ? అప్పుడే మీచేతులో రూపాయలు పడడానికి సిద్ధంగా వున్నట్టు మాట్లాడుతారేవిఁటి ? నేను యంత శ్రమపడ్డ పైనిపతకం తిరగాలి ? అది ఆలోచించారా ?

కర—తాము అలాఅంటే నేనేం మనవిచెయ్యనండి ? రక్తం మాంసం అమ్ముకుంటూన్నప్పుడు ఆ కానికూడయినా సంతుష్టిగా దొరకడం న్యాయంగదండి ? వ్యవహారాల తొట్రుబాటుచాతనూ పిల్లకట్టు దప్పివుండడం చాతనూ, తొందరబడుతున్నానుగానండి, కొంచం వ్యవధివుంటే రెండువేలకి పైగా అమ్ముకుందునండి.

రామ—"అయితేఁగియితేలు" అనుకున్న లాభం లేదని చెప్పానుకానా ? ఐదోవొంతుకు యేవఁంటారు ?

కర—యీపాపపు సొమ్ముకే తమరు ఆశించాలా అండి ?

రామ—పాపపు సొమ్ము మాదగ్గిరకిరాగానే పవిత్రవైఁపోతుంది. ఒహాళ్ళ కివ్వడం కోసవేఁగాని నాక్కావాలా యేవిఁటి ?

కర—ఒతే కానియ్యండి,

రామ—యిక నా ప్రయోజకత్వం చూడండి. మధురం ! మధురం ! కాకితం, కలం సిరాబుడ్డీ తీసుకురా. మా మోలు సిరాబుడ్డి కాక గూట్లోది పెద్దసిరాబుడ్డి తే,

మధు—(అవతలనుంచి) నాకెంతొ మధురం కంటబడ్డ తరవాత నేనెందుకు ?

రామ—ఆడవాళ్ళకి అనుమానం లావండి. వింటున్నారా ? అదో ముచ్చట !

కర—కేవలం వజ్రాన్ని సంపాదించారు !

రామ—వజ్రవేఁగానండి, పట్టణాసపు అలవాటుచాత పదిమందితో మాట్లాడితేగాని దానికి వూసుబోదు.

కర—ఆమాత్రం స్వేచ్ఛయివ్వడవేఁ మంచిదండి ; ఆడదాన్నట్టే రోకాయించకూడదండి !

రామ—రోకాయిస్తే యెంజెస్తుం దేవిఁటండి ?

కర—యిలాంటి మానఁగల మనిషైతే నూతులో గోతులో పడుతుందండి.

రామ—అలాగనా అండి ?

కర—అందుకు సందేహ మేమిటండి ? నాజూకైన మనస్సుగల స్త్రీని మల్లెపువ్వులాగ వాడుకోవాలండి.

రామ—ఆ నాజూకులూ గిజూకులూ మీకేం తెలుసునండి ?

కర—పుస్తకాల్లో చదువుకున్న ముక్కలు. నాయకుడు నిరాకరిస్తే నాయికవొచ్చిన్నీ యేవే, ఉద్యానాల్లో వుండుకున్న షువంటి లతలతో వురిపోసుకుంచుందండి. మహా కవుల నాటకాల్లో అస్లాగే జరిగినట్లు రాశారండి.

రామ—మరెవళ్ళతో మాట్లాడినా తప్పులేదుగాని, పెద్దుకనిష్టిబుతో మాత్రం మాట్లాడవద్దని బుద్ధిచప్పండి. మీరు తండ్రిలాంటి వారుగదా?

కర—ప్పు! అంత అదృష్టవాఁ అండి! అట్లాంటి పిల్లే నాకువుంటే, మూడు నాలుగు వేల కమ్ముకుని రుణాలూ పణాలూ లేకుండా కాలక్షేపం చేసివుందును, దీన్నయినా నాలుగు దిక్కులా అమ్మజూపితే రెండుమూడువేలు యిదివరకే చేతులోపడివుండునండి. మేనరికం చెయ్యాలని దీంతల్లి భీష్మించుక్కూచోబట్టి యీదురవస్థ మాకొచ్చింది. అంచాతనే యింట్లో చప్పకుండా యీపిల్లని వెంట తీసుకొచ్చి యీ దేశంలో పెళ్ళికి చూపుతున్నాను.

రామ—నాసహాయ లోపం వుండబోదు.

కర—ఐతే కార్యవఁయిందే!

రామ—యేదీ పిల్లా యిలారా, చెయిచూపించూ.

(శిష్యుడు భయం నటించి వెనక్కి తక్కును)

కర—చూపించమ్మా, భయంలె చ్చూపించు (కరటకశాస్త్రుల్లు శిష్యుణ్ణి రామప్పంతులు దగ్గిరికి తోయును. రామప్పంతులు చెయ్యిపట్టుకుని అరిచెయ్యి చూచుచుండును శిష్యుడు చెయ్యిలాగుకొంటూన్నట్టు నటించును. మధురవాణి సిరాబుడ్డీ కలం కాకితం పట్టుకుని రామప్పంతులు వెనక నిలుచుండును.)

రామ—ఆహా! యెంధనరేఖా! సంతానయోగ్యత బాగావుంది,

మధు—మీరు చేపట్టింతరవాత, అందుకులోపం వుంటుందా?

(సిరాబుడ్డిలోని సిరా రామప్పంతులు ముఖంమీద పోసి ఛట్టున వెళ్ళిపోవును)

## 3-వ స్థలము. కృష్ణారాయపురం అగ్రహారంలో అగ్నిహోత్రావధాన్లుగారి యిల్లు.

(వీధిగుమ్మంయదట గిరీశంనిలిచి సన్ననిగొంతుకతో పాడును.)

"కాముని విరిశరములబారికినే,
నేమని సహింతునే. చెలి, యేమని సహింతునే?"

వీడితస్సాగొయ్యా, వీడిబాణాలు పువ్వులటోయి? ఆమాట యెవడునమ్ముతాడు వెఱ్ఱికుట్టె యెవడైనా నమ్మాలిగాని? అనుభవ వేద్యమైన దీని నిజం యేవిఁటంటే:—మంచిపదును బట్టినలోహం మొనకి, డయమండ్ పాయంట్ వేసి. పాయిజన్‌లో ముంచి, కంటికి కనపడకుండా మంత్రించి విసురుతాడు. అంచేతనే, పైకి గాయం కనపడదుగాని పోలీసువాళ్ళ దెబ్బల్లాగ లోపలతహతహా పుట్టిస్తాయి. యీ విడో

లుబ్ధా—దాన్ని పాడుచేస్తున్నావూ ?
మీనా—యిలాంటి మాటలంటేనే నాకు అసయ్యం; మీరు యక్కడో దడును కున్నారు కాబోలు! అంచేత దుష్టుకల వొచ్చింది. అంతేగాని, రెండో పెళ్ళి, మూడో పెళ్ళి, అని, వెఱ్ఱులు వోడకండి పూజారి గవరయ్యని పిలుస్తాను; అతగాడు యింత మంత్రించి వీబూదియిస్తాడు రాసుకుపడుకోండి.
లుబ్ధా—కొంపతీస్తావా యేవిటి ? వాడొస్తే వాడితో యేవని చెప్పడం ? దాన్నే నిజం అడుగుదూ.
మీనా—నే నడగను, నాన్నా, నన్ను అడ్డమైన మాటలూ అంటూంటే. నేనెందుకు అడుగుతానూ ? నేం దాంతో యిగమాట్లే అణ్ణు.
లుబ్ధా—నాతల్లివి కాదూ, అడుగమ్మా.

(మీనాక్షి పైకి వెళ్ళును)

ఓసన్నం యాకర శెప్తేదా ? గాయత్రీ స్మరణ చేసేదా ?

వేదాలూ, మహామంత్రాలూ, యీ దెయ్యాలకి పేలపిండి వోడియాలు. శాపరమంత్రాలు ఉపదేశం అవుదావంటే, బెడిసి గొడితా యేమో అని భయం, యేవిటిసాధనం ? "రామనామతారకం" స్మరణ చేస్తాను. "రామనామ తారకం । భక్తిముక్తిదాయకం । జానకీమనోహరం । సర్వలోకనాయకం । రామనామతారకం । రామనామతారకం" యీముండ యింట్లోవుంటే, నే బతకను. "రామనామతారకం । రామనామతారకం" । రుద్రాక్షతావళం యేదీ ? (మంచము అంచునకూచుని పరుపుకింద తడివిటి, రుద్రాక్షతావళం తీయుచుండగా మీనాక్షి ప్రవేశించి)

మీనా—మీమాట నిజవేఁ నాన్నా.
లుబ్ధా—నిజవేఁ!

(మంచముమీదినుంచి కింద కూలబడును)

మీనా—(లేవతీసి) నాన్నా! నాన్నా! పడిపోయినా వేఁవి ?
లుబ్ధా— యేవీఁలేదూ. నిజవేఁ! నిజవేఁ!
మీనా—నిజవేఁను, ఆ మొగుడు యిప్పుడే దానిక్కూడా కనపడి, "ముండా, మళ్ళీ పెళ్ళాడావే ? నీకొత్త మొగుణ్ణి పీక పిసికేస్తాను చూడు" అన్నాట్ట.
లుబ్ధా—అయ్యో! అయ్యో! రామప్పంతులు యిల్లు వొల్లకాడు కానూ! యక్కడ కల్పించాడే యీమాయపెళ్ళి నాకోసం! పీడ పిండం పిల్లులికి పెట్టా! అయ్యో! అయ్యో! ఆమొగుడు వెధవ యలా వున్నాడంటే ?
మీనా—వాడు రోజూ దానికి కనపడతాట్ట నాన్నా. వాడికి మీసాలూ, గిరజాలూ, వున్నాయట, దావం దాయట.

లుబ్ధా—వాడేనే! వాడేనే! యేవిఁటే సాధనం? యిహ నేం దక్కను.

మీనా—పూజారి గవరయ్యకి కబురు పెడతాను.

లుబ్ధా—వొద్దు, వొద్దు, నామాటవిను. వాడొచ్చాడంటే, యిల్లు తినేస్తాడు.

మీనా—తిం టేతింటాడు. ప్రాణంకంటేనా యేవిఁటి?

లుబ్ధా—నాకొద్దంటూంటే వినవుగదా. నువ్వు నామంచం దగ్గిర పక్కేసుకు పడుకో; నువ్వు చదువుకునే భాగవతం పుస్తకం పట్రా; తలకింద పెట్టుకు పడుకుంటాను.

(మీనాక్షి వెళ్ళును)

యీముండ నాయింట్లోంచి విరగడై పోతేనేగాని, యీ పిశాచం వొదిలి పోదు. వేదం చదువుకున్న ముండాకొడుకుని, నామీదే కద్దతరవాత, వీడు బ్రహ్మరాక్షసిగాని, వొట్టిదెయ్యంకాడు. పోనీ అతడికే ప్రార్థనచేస్తాను— “నాపెళ్ళాం మొదటిమొగుడా!” ఆఁ! నాపెళ్ళాం కాదు లెంపలు వాయించు కుంటాను. “యీపిల్ల మొగుడా! నువ్వే నిజవైఁన మొగుడివి—నేనుకాను, దాన్ని ముట్టను—తాకను—దాంచేత చాకిరీ అయినా చేయించను. నన్ను రక్షించి, పీకపిసికెయ్యకు; పీకపిసికెయ్యక: యేపాపం చెయబట్టో దెయ్యావి వైనావు. నన్ను చంపావంటె బ్రహ్మహత్య చుట్టుకుంటుంది. మరిజన్మం వుండదు. బాబూ! నాయనా! తండ్రీ! నాజోలికి రాకు. సీమావఁగారి పీకనులివెయ్యి! ఆ రావఁప్పంతులుగాడి పీకనులివెయ్యి! లేకపోతే, (కేకలు, యేడ్పు విన బడును) ఓరి దేవుడా! మళ్ళీ వొచ్చాడు కాబోలు (శిష్యుడు యేడుస్తూ పరి గెత్తివచ్చి లుబ్ధావధాన్లును గట్టిగా కౌగలించుకొనును. మీనాక్షి శిష్యుణ్ణి చీపురుగట్టతో కొట్టబోవును. శిష్యుడు తప్పించుకోగా, దెబ్బలు లుబ్ధావధాన్లకు తగులును.)

మీనా—ముండా! నామోహులరు అక్కడపడేస్తావా పడెయ్యవా? నాతాళం యేదే లంజా?

లుబ్ధా—నన్ను కొట్టేశావేవిఁటే? (శిష్యుడితో) వొదులు, వొదులు. నన్ను ముట్టు కోకే తల్లీ (మీనాక్షితో) దీని అపవిత్రపు వొళ్ళు తగిల్తే చచ్చిపోతాను, నన్ను వొదిలిపించెయ్యి.

(మీనాక్షి శిష్యుడి రెక్కలుపట్టిలాగి. బుగ్గగిల్లును. శిష్యుడు మీనాక్షిచెయ్యి కరిచి పారిపోవును.)

మీనా—దానమ్మ కడుపుకాలా, చెయ్యి కరిచేసింది నాన్నా—రక్తం బొటబొట కారు తూంది—దీన్ని పాతవాఁరుస్తాను.

లుబ్ధా—యంత దారుణప్పని చేసింది- ముండ! యేదన్నా చెయ్యి (గుడ్డపీలికతో రక్తం తుడిచి) మహులరడిగావుగదా యక్కడిదేవిఁటి?

మీనా—అసంద్రిపెధవ నాకిమ్మని యీముండచేతికి యిచ్చాడు. దీని నక్కవినయాలు

చూసి నా పెట్టాబాడా ధానికే ఎప్పచెప్పి, ఆమోహాలరు దాన్నే దాచమన్నాను. అను మానవేసి యిప్పుడు నా మోరు తెమ్మంటే, "బట్టల పెట్లో పెట్టాను తాళంపోయింది" అంది. తాళం తాకపోతే రోకలితో బుఱ్ఱ చితకబొడుస్తాను.

లుబ్ధా—చెయిజేసుకోకు. నీది వెఱ్ఱికోపం చావగొట్టగలవు జాగ్రత్త!

మీనా—చస్తే యీడిచిపారేస్తాను. ముండయెలా కరిచిందో చూడండి. యింకా రక్తం కారుతూంది. మనిషికాటుకి మందులేదన్నాడు.

లుబ్ధా—కుంకం పెట్టమ్మా.

మీనా—దానిబుఱ్ఱ చితకబొడిచి మరీ పెడతాను (మీనాక్షి వెళ్ళును.)

లుబ్ధా—గుండుగొమ్ముల అనుమానం తీరిపోయింది–పీక నులివి, వాడైనా చంపేస్తాడు; కరిచి అదైనా చంపేస్తుంది, వీడిచేతో, దానిచేతో, చావుతప్పదు. యెంతశబ్బస్తి కొనుక్కున్నాన్రా, యీచావుపెళ్ళి! అయ్యో! అయ్యో! దీన్ని పైకి తగిలేస్తే వాడుకూడా విరగడైపోతాడు. అదేసాధనం–యెక్కడికి తోలెయ్యను? బండిమీద యెక్కించి పట్నం తోలేస్తాను–అక్కడగాని తండ్రివెధవ కనబడకపోతే మళ్ళీ దెయ్యాన్ని నెత్తిని పెట్టుకుని ప్రత్యక్షం అవుతుందే! బండి అద్దె యిచ్చుకోవడవే మిగుల్తుంది–యేమిసాధనం?–యేమిసాధనం?–రామప్పంతుల్ని సలహా అడుగుదునా? ఆఁ! మంచి ఆలోచన తోచింది–రామప్పంతులు నాకు కట్టిపెట్టిన యీ ముండని, వాడిదగ్గిరికే పంపించేస్తాను–సాని దాంతోపాటు దీన్నికూడా వుంచుకుంటాడు–కావలిస్తే పదిరూపాయలు దక్షిణతోకూడా యిచ్చేస్తాను.

[మీనాక్షి ప్రవేశించి]

మీనా—యక్కడా కనపడదు నాన్నా గుంట.

లుబ్ధా—నూతులోపళ్ళేదుకద?

మీనా—యేమో!

లుబ్ధా—పరిగెత్తెళ్ళి గవరైని పిలవమను. దాన్ని నువ్వు చావగొట్టలేదుగద?

మీనా—కనపడితేనా?

లుబ్ధా—యేవిటినాయనా, యీకొత్త ఉపద్రవం!

(నిష్క్రమింతురు)

## ౨-వ స్థలము రామప్పంతులు యింట్లో కొట్టుగది.

భుక్త, పోలిశెట్టి, సిద్ధాంతి, మధురవాణి పేకాడుచుందురు.

పూజారి గవరయ్య ఆట చూచుచుండును.

పోలి—యేంశత్రాకారి ముక్కలు యేశావయ్యా; యెప్పుడూ నువ్వింతేను,

భుక్త—మూసివేశావూ యేమిటంటి? నీ పవిత్రదేవతని పెట్టు.

పోలి—గవరయ్యా, నీమునుకు నాదగ్గిర యిలా యెట్టకు. తెచిపో, నీపుణ్యావుంటుంది.

గవ—నేను మా మధురవాణిదగ్గిర కూచుంటాను.

భుక్త—చూడూ. ముక్కతప్పు పడ్డట్టుంది.

పోలి—ఆఁ! బాపనయ్య పంచాంగని తప్పు పంచుతున్నావు. తప్పు పంచితే తేస్తుమీద కుదేలెట్టిస్తాను.

భుక్త—ముక్కలు బాగా పడలేదన్నావే?

పోలి—రెండో యేక నాలుగాసులు పడాలా?

భుక్త—(పోలిశెట్టికి ముక్కలు వేస్తూ) యిదుగో నాలుగాసు లేస్తున్నాను, ఱజ్జు.

పోలి—నీయిపపచేత్తో యేస్తే, పొల్లుముక్కలే పడతాయి; మంచిముక్కలడతాయా?

భుక్త—తథాస్తు!

పోలి—అలా అనకు. యెంత శెడ్డా బాపనాడి శాపనాకారం మాశెడ్డది. (చూచుకొని) శీ! భష్టాకారి ముక్కలు!

సిద్ధాం—ఒకటి, రెండు.

పోలి—అదుగో, అలా శెప్పితేనే వొప్పను. ఒక్కొకటి శెప్పాలి.

సిద్ధాం—అయితే వకటి.

పోలి—ఒక్కటి.

మధు—ఒకటి,

భుక్త—వకటి.

(సిద్ధాంతి ఆలోచించును)

పోలి—యే టాలోసిస్తావు చేతరస! యెత్తవయ్యా.

సిద్ధాం—నీదేంపోయింది! రెండు.

పోలి—లాంత రేశావు. యేమెత్తను? రొండు.

మధు—రెండు.

భుక్త—రొండు.

(సిద్ధాంతి ఆలోచించును)

పోలి—యే టాలోసిస్తావు? చేతరస; యెత్తి శేస్తు గెలుసుకో.

సిద్ధాం—నువు చెప్పావుగనక యెత్తుతాను.

పోలి—ఆఁ! దబ్బరకట్టెట్టి మరియెత్తు. మూడో యెత్తుదపు తేస్తు; గాపకవుందా? శేస్తుమీదకు దేలెట్టి, బాకీ లెట్టి, యగెయ్యడానికా?

సిద్ధాం—(తనముక్కలు యెత్తు ముక్కలమీద వేసి) కోటంభూడి పిలక నిగుడ్తూవుంది!

పోలి—తెంతావా యేటి?

సిద్ధాం—తన్నడవంటే. ఓహోలాగనా,
పోలి—నా ఆట శెడిగొట్టేశినావు. శావనయ్యా!
భుక్త—ముక్కలు పడలేదని యేడుస్తూ, మళ్లీ యేవిఁటి, ఆట చెడగొట్టాడని యేడుస్తావు ?
పోలి—యీ ఆట బేస్తుచేయించకపోతే నా పేరు—
సిద్ధాం—కోవఁటూడా. నోరు మూసుకుంటావా మూసుకోవా ?
పోలి—శెల్లాడిశావుటూ మొగురుతుండగా, నిజాలువేఁటి ? ముక్కల్తియ్యడం యింత నేపైతే మరాశేఁటి ?
సిద్ధాం—నువ్వుగాని మళ్లీ మాట్లాడావంటే, ముక్కలు కలిపేస్తాను.
(పోలిశెట్టి "నేను మాటాడను; నువ్వుఆడు" అని సాక్షి చేయును. సిద్ధాంతి ఆడును)
పోలి—మూడే తురుపులు పడ్డాయి శావనాడా: "తమాషాదేఖో, లంకకేరాజా!"
సిద్ధాం—ఆటపారెయ్యనా ?
పోలి—బుద్ధొచ్చింది; బుద్ధొచ్చింది. లెంపలోయించుకుంటాను. మరిమాటాడితొట్టు.
పూజారి—మా మధురవాణిమీద ఆశుకవిత్వం చెబుతాను.

రాణా, డైమను రాణీ ?।
రాణా, యిస్పేటు రాణీ ? రాణి కళావ ?
జాణా ఆఠీన్రాణీ ?।
రాణీ యనన్మధురవాణె, రాజులరాణీ॥

సిద్ధాం—గవరయ్యా! యేంవిలవైన పద్యం చెప్పావోయి! నీమీద నేను పద్యంచెబుతాను—విను,

"గవరయ్యా! నీసరి మరి।
యెవరయ్యా?"

పూజారి—"యెవరు లేరు, యిచ్చోనయ్యా!
సిద్ధాం—యిదుగో రాజు.
పోలి—యిదుగో పాల్తు.

(మధురవాణి తురుపురాణి వేయును)

పోలి—అదుగో, అదుగో, యీ శావనాడు కపిశం శెప్పి, మధురవాణి దగ్గిర రాణీ వుందని శెప్పేశాడు. గోరం, గోరం గవరయగానీ మాటాడితే నే ఆటాణ్ణు.
పూజారి—పోలిశెట్టిమీద కవిత్వంచెప్పి చాలారోజులైంది. (పొడుంపిల్చి)
"పోలిశెట్టిముఖము—పోలికొట్టైనుబోలు ! పోలిశెట్టిముక్కు పొడుముడొక్కు॥"
పోలి—వొద్దు! వొద్దు! వొద్దు! నామాటను పాసంపెట్టి నగపెస్తావాయేటి ? ఊరుకుంటి వొట్టాయినా, యిన్నావా! యీ ఆట సిద్ధాంతి బేస్తెట్టి. నేను గెలిస్తే నీక్కాండవిప్పిస్తాను. మరహారుకో.

సిద్ధాం—నీసోదతగలజా – తురవు మిగిలి పోయింది; జేస్తు (ముక్కలు చూపించి పారవేయును.)

పోలి—ఆఁ! మూడో యెత్తడజ్వేస్తు. నాపకాలుంచుకోం డయ్యా, చేతివారస మంచి ముక్కలెయి, జాపనాడా అంతసేపు కలపడవాఁ? గోరం, గోరం.

సిద్ధాం—బులబులాగ్గాకలిపి, జేస్తు నీకిస్తాననుకున్నావా ?

పోలి—తోలుసేత్తో, ముక్కతేసినావు! "నరిసింవ్వ నీదివ్వె నామమంతరముశాత! నరిసింవ్వనీదివ్వె—"

సిద్ధాం—దివ్వెలేదు, దీపంలేదు ముక్కత్తియ్యి.

పోలి—గవరయ్య ముక్కలమీద కన్నేసి సిల్లంగెట్టేస్తున్నాడు· నరసింవ్వ నీదివ్వె – (ముక్కలు యెత్తిచూసి) నీ భష్టాకారి ముక్క తేశావు.

సిద్ధాం—(సంపకం ముగించి తనముక్కలు తీసి చూచుకొని) మృత్తికాచమే !

పూజారి—పోలిశెట్టికి అంత అలకైతే, నేనింటికిపోయి పరుంటాను.

(గవరయ్య నిష్క్రమించును. మధురవాణి వెంటవెళ్ళి తిరిగివచ్చును)

పోలి—శని విరగడైపోయిందిరా, దేవుఁడా!—ఒట్టి భష్టాకారిముక్కలు. ఒహాటీ.

మధు—ఒకటి.

భుక్త—ఒహాటి.

సిద్ధాం—ఒహాటీ.

పోలి—రెండు.

మధు—రెండు.

భుక్త—రెండు.

(సిద్ధాంతి ఆలోచించును)

పోలి—యెందుకా యెజ్జాలోశన? నామాటిను, మూడో జేస్తెట్టకు,

(వీధి తలుపు తట్టబడును.)

మధు—పంతులు!

పోలి—యీవాళ రాడని సెప్పితివే ?

మధు—రారనుకున్నాను వొచ్చారు. యేంచేదాం ?

సిద్ధాం—ఆటతీసెయ్యండి. (ముక్కలుపడవేయును)

పోలి—జేస్తె గెయడానికా? నే నొప్పను. మధురోఁశ, ఆటాడి మరీ తలుపుతియ్యి.

మధు—ముక్కలుకిందబెట్టి లేచి· (సన్నని గొంతుకతో) గోడగెంతి పారిపోండి,

భుక్త—దిడ్డితోవంట వెళ్ళిపోతాం.

పోలి—నేను పట్టనే ? యేటి సాధనం ?

భుక్త—యేం దిడ్డితోవంటపోతాం. నువ్వు ఆటకెక్కు.

పోలి—వెన్నెక్కించి నుగ్గె యెక్కింది. కాలం జారితే సోటిసాధనం?

సిద్ధాం—నీకొడుకుది, అదృష్టం.

(పెరటిలోకి వెళ్ళును)

పోలి—గోరం! గోరం! గోరం! యవడిముక్కలు అడిదగ్గిరే! ఆట కలపకండి

(తలుపు తిరిగి తట్టబడును)

పోలి—నరిశింవ్వ. నీదివ్వో—

(మధురవాణి ఊరుకొమ్మని కోపరసంగా సౌజ్ఞచేయును)

(సిద్ధాంతి ప్రవేశించును)

సిద్ధాం—దిడ్డీతలుపు కప్పుతాళం వేశుంది. మన్నిపట్టుగుంచావ(నే. పంతులు దిడ్డీతలుపు తాళ వే(శాడు.

పోలి—నరిసింవ్వ. నీదివ్వో—

మధు—(పోలిశెట్టిని ఉద్దేశించి) చప్! (సన్నని గొంతుకతో) ఉలక్కుండా, పలక్కుండా యీగదిలో కూచోండి; ఆయన పరున్నతరవాత వచ్చి తలుపుతీసి వొదిలేస్తాను. (దీపములు ఆర్పి, మైకివెళ్ళి, గదితలుపువేసి గొళ్ళెము బిగించును)

(తలుపుతిరిగి తట్టబడును)

మధు—యేవీ(గవరయ్యొ చాదస్తం! అదే తట్టడవా(? (వీధి తలుపుదగ్గిరకు వెళ్ళి) యెవరు?

తలుపవతలమనిషి—యింత సేపేం?

మధు—నిద్దరబోతున్నాను.

మనిషి—పేక! పేక! పేక! నిన్నొదిలేస్తాను. నీ సంగతి నాకు తెలిసింది.

మధు—మరి, మీ మానాన్న మీరు పోయి, నిశిరాత్రివేళ వొక్కర్తెనీ నన్ను వొదిలేస్తే యీ అడివి వూళ్ళో నాకు భయంకాదా? అంచేత పల్లిగ్గా నలుగుర్ని పిలిచి పేకాడుతున్నాను. తప్పేవుం(ది? మంచు పడుతూంది. లోపలికిరండి (తలుపు గడియతీసి) రండి. నాఆట మీరాడండి, నేను పరుంటాను.

మనిషి—సాందాన్ని యవడు నమ్మమన్నాడు? నీకిద్దావ(ని సంతోషంతో వక సరుకు తెచ్చాను. నీచర్య చూసేటప్పటికి నామనస్సు చివుక్కుమని పోయింది.

మధు—యెంత న్యాయంగా సంచరించినా, మీ హృదయంలో కాసింత కనికరం లేదుగదా? యీ నాటినుంచి మీరు యెక్కడికి రమాను పెళుతూవుంటే, అక్కడకల్లా నేనుకూడా మీతో వొస్తూవుంటాను.

మనిషి—మెడమైకివుంచు (మధురవాణి అటులచేయును. ఆమనిషి మధురవాణి మెడలో కంటె వుంచును.)

మధు—ఔరా! యింద్రజాలి! పంతులు గొంతుక యెలా పట్టావు? నన్నే మోసపుచ్చితివే? (రెక్కపట్టుకొని) గదులోకిరా. (గదులోకి తీసుకువెళ్ళును) యీ

చిల్లంగి కళ్ళు నీకే దేవుఁడిచ్చాడు? (ముద్దెట్టుకొనును) ఎన్నింటి యేమేమి చిత్రాలు చేశావో చెప్పు.

శిష్యు— ముద్దెట్టుకోనంటే, చెబుతాను?

మధు—నీకు తగనో?

శిష్యు—ముద్దెట్టుకుంటే యెంగిలౌతుంది

మధు—నిజం. నీకున్నబుద్ధి నీపెద్దలికిలేదు. నన్ను నిష్కారణంగా భయపెట్టావు. అందుకు నీ కేవిఁటిశిక్ష? బుగ్గకొరికేతునా?

శిష్యు—పాలూ పంచదారావుంటే ఇయ్యి.

మధు—తరవాత మేపుతాను. ముందు నీకు దాసరివేషం వేస్తాను. కొత్త అగ్రహారం పోయి నీగురువును చేరుకుందుగాని. (తెరదించవలెను)

(చీకటిగదిలో పోలిశెట్టి భుక్త. సిద్ధాంతి వుందురు-తెర అవతలనుంచి రామప్పంతులు గొంతుకతో, శిష్యుడు "యీగదులో యవణ్ణోదాచావు")

మధు—రామ! రామ! యవ్వడూలేడు.

(పోలిశెట్టి నిచ్చెనయెక్కును, భుక్తకూడా యెక్కబోవును, నాలుగు మెట్లెక్కి యిద్దరూ కింద బడుదురు)

పోలి—సంపేశినావు, బాపనాడా!

భుక్త—నామీద నువ్వుపడి, నేను వుక్కిరిబిక్కిరి ఔతూంటే, నువ్వు సచ్చానంటా వేవిఁటి? లేస్తావా కరిచేదా?

శిష్యు—(రామప్పంతులు గొంతుకతో) అదుగో లోపల యెవళ్ళో మాట్లాడుతున్నారు లంజా! అదికోవఁటాడి గొంతుకలావుంది. కప్పతాళం వేసి వూరందరినీ లేవదీసుకొస్తాను.

మధు—కప్పతాళ వెందుకు? లోపల యెవళ్ళూలేరు. దెయ్యాలకొంప-దెయ్యాలు దెబ్బలాడుతున్నాయి.

(మధురవాణి తలుపుతీసి గదిలో ప్రవేశించి అగ్గిపుల్ల వెలిగించును. శిష్యుడు పక్కకి తొలగిపోవును)

మధు—పోలిశెట్టియేమి, పడుకునిలేవడు-మేలుకొలుపులు పాడనా?

భుక్త—రామప్పంతులేడీ?

మధు—రామప్పంతులూలేడు, గీమప్పంతులూలేడు. యింట్లో పనిచేసేవాడు తలుపు కొట్టాడు. బెంగెట్టుకోకండి.

భుక్త—అతగాడిమాటలు వింటేవే?

మధు—నేనే ఆయన గొంతుకు పెట్టిమాట్లాడాను. యేమిధైర్యం! యేమి మగతనం!

పోలి—"నరసింహ్వ, నీ దివ్వె" (లేచి) "నామమంత్రరము సేత"—యవడిముక్కలాడి దగ్గిరున్నాయా?

(అంతా మళ్ళీ ఆటకు కూచుందురు)

సిద్ధాం— ఆటకలిపేశాను.

పోలి— గోరం! గోరం! నాకు యిసిపేటు అసు దాడదొచ్చిందిగదా. బేస్తులు గెలుసుకు పోదునే! గోరం! గోరం! మధురోణీ, ఒట్టినే బెంబేరు పెట్టేశింది. అటక మీంచిపడి నడుంవిరిగిపోయిందిరా దేవుడా!

భుక్త— నీ కిందపడి నేను నలిగిపోయినాను, నీకేం తీపు దిగదీసింది?

పోలి— కలిపి యెయ్యి - ముక్కలు.

సిద్ధాం— నేను కలపను— నా వొంతు అయిపోయింది— నువుకలువు.

పోలి— యేమైపోయింది?

(రామప్పంతులు వీధి తలుపు తట్టును)

రామ— లక్ష్మి, లక్ష్మి, తలుపు,

మధు— యీ మాటు పంతులే.

పోలి— యేటిసాధనం?

మధు— గోడ గెంతి వెళ్ళిపోండి.

పోలి— నేను గెంతలేనే?

మధు— నిన్ను యీగదిలో పెట్టి తాళంవేస్తాను.

పోలి— దీపం ఆరిపెయ్యి. నాకు బయవేస్తుంది,

సిద్ధాం— గాజు పెంకులు గుచ్చుకుంటాయి; గోడదాటడం యెలాగ?

భుక్త— నాకు కాళ్ళు మేహవాతం నొప్పులు. నేను గెంతలేనే?

మధు— (దీపవార్పి) యిలాగే వుండండి,

పోలి— నరిసింవ్వ, —

మధు— చప్!

పోలి— సచ్చాను,

మధు— (గది గొళ్ళెంవేసి, వీధితలుపు గడియతీసి తలుపు ఓరగావుంచి) మాయగుంటని యెక్కడదాచారు?

రామ— మాయగుంట యేమిటి?

మధు— యేం సంగనాచే? లుబ్ధావధాన్లు మాయపెళ్ళాన్ని వాళ్ళయింట్లోంచి లేవదీసుకుపోయి యెక్కడపెట్టారు? యిదేకదూ, రాత్రల్లా మీరు చేస్తూన్న శాక్యవ్యవహారం?

రామ— నీమాట నాకేవీ అర్థం కాకుండా వుంది. యింట్లోంచి లేవదీసుకు పోవడ వేఁవిటి? నేను దాచడవేఁవిటి?

మధు— దాస్తే దాచారు, దాచకపోతే మానారు. నా కెందుకు చెప్పరేం?

రామ—నీకంటా ? మరిచిపోయినాను సుమా.

మధు—యేమిచిత్రం ! నన్ను మరిచారు—నావస్తువ అని, మరిచారు, మరిచి, ఆగుంట, కిచ్చారు, దాన్ని లేవదీసుకుపోయి యెక్కడోదాచి, నిశిరాత్రివేళ పెద్దమనిషిలా, యింటికివొచ్చారు !

రామ—ఆగుంట కనపడదా యేవిఁటి ?

మధు—యేవిఁనాటకం ! మీకు కనపడకేం ? మీరు పెట్టినచోటేవుంది.

రామ—మీనాటి తన్నితగిలేశిందా యేవిఁటి ? కంటెతో తగిలేస్తేచచ్చానే ?

మధు—యేమినాటకం ! చావండి; బతకండి; ఆకంటెతాందీ, గడపలో కాలుపెట్టనివ్వను,

(తలుపు వేయును)

రామ—నాలుగుకోసులు గుఱ్ఱపసవారీ అయి, యీమధురోమని యిల్లు చేరుకుని, గుమ్మంలో అడుగుపెట్టేసరికి మబ్బులేని పిడుగుపడ్డది. మీనాటి ఆగుంటని మన్ననిస్తుందని, నేను యెన్నడయినా అనుకున్నానా యేవిఁటి ? ఆగుంట పోతేపోయింది, వుంటేవుంది; నాకంటె పోకుండా వుంటే అదృష్టవంతుణ్ణి. కంటె అడగానికి వెళితే, "నువ్వే యీ పెళ్ళి కుదిర్చావు" అనికఱ్ఱుచ్చుకుంటాడేమో!

(నిష్క్రమించును.)

3-వ స్థలము లుబ్ధావధాన్లు యింటివాకలి.

లుబ్ధావధాన్లు—(పచారుచేస్తూ)

కనవడకపోతే యేమైఁనట్టు ? నూతులోగానీ పడిందా ? పోలీసువాళ్ళు యిల్లుదోచేస్తారు నూతులో పడలేదా ? పడకపోతే యేమైఁనట్లు ?—రావంవ్వంతులు యింటికి పోయుంటుంది. అంతే కావాలి—యంత అందమైఁన పిల్లా! నాదిగాక దురదృష్టం ! యంతట్లో వెన్నెల చీకటైంది ! రేపో యెల్లుండో యెదిగొచ్చే పిల్లగదా అని సంబరపడ్డాను—ఓహోవేళ,—అప్పుడే పెద్దమనిషైందేమో?— అందుకు సందేహంవేఁలా? లాకుంటే యింత యేపైన పిల్లి పెద్దపడుచు కాకుండావుంటుందా ? యిలాంటివి యెన్ని పెళ్లిళ్లు చేసుకుని యందరు మొగుళ్ళని కడితేర్చిందో! ఒరి కుంకపీనుగా, నీకళ్లు యేమైఁపోయినాయిరా? రజస్వలాముండని చూస్తూ, చూస్తూ, యలా పెళ్ళాడావురా ? మరి నీకు గతులు లేవు. రాజమహేంద్రవరంలో వెధవ ముండల్ని పెళ్ళాడినవాళ్ళ సామాజికంతో చేరావురా ? అయ్యో! అయ్యో! దీనికి మరి ప్రాయశ్చిత్తం యక్కడిది ? ఒహోవేళ చేయించుకుందావంటే, శంకరాచార్యులు పాదకట్టం పెట్టమన్నాగాడు. బ్రాహ్మలు యిల్లు తినేస్తారు. అంతకంటె పోలీసువాళ్ళు

నయం, అల్లరికాకుండా పెద్దచేతులో పాతిక రూపాయలు పెట్టి. రేపు రాత్రి బయల్దేరి కాశీ పోయి, గంగలో మునిగానంటే అన్ని పాపాలూ పోతాయి. కాశీవాసవేఁ చేసుకుంటాను. భగవంతుడు బుద్ధొచ్చేటట్టు చేశాడు. లేకుంటే, ముసలివెధవకి పెళ్ళి చేసుకోవడవు పోయీ కాలవేఁవిఁ? అన్నివిధాలా రామప్పంతులు నాకొంప తీశాడు.

[రామప్పంతులు ప్రవేశించి]

రామ—యేవిఁటి మావాఁ రావఁప్పంతులంటున్నారూ?
లుబ్ధా—యేవీఁలేదూ.
రామ—యింతరాత్రివేళ పచారు చేస్తున్నారేవిఁ?
లుబ్ధా—యేమీ లేదు—నిద్దరపట్టక.
రామ—మావఁగారూ, ఆకంటె యిప్పుడు తెమ్మని మధురవాణి భీష్మించుకు కూచుంది. శ్రమ అని ఆలోచించక యిప్పించాలి.
లుబ్ధా—కంటేవిఁటి?
రామ—మీభార్యాకి పెట్టిన కంటండీ.
లుబ్ధా—నాభార్యాకి నేను పెట్టలేదు.
రామ—మీరు పెట్టమంటే, నేను యెరువు తెచ్చానుకానా?
లుబ్ధా—నేను పెట్టమన్లేదు.
రామ—అయితే దొబ్బేస్తావా యేవిఁటి? మీభార్యామెళ్ళో యిప్పుడా కంటలేదూ!
లుబ్ధా—నాభార్యా యెవరు? నాభార్యా నాడే చచ్చింది.
రామ—మొన్న మీరు పెళ్ళిచేసుకున్న పిల్ల మీభార్యా కాదటయ్యా?
లుబ్ధా—రెండో పెళ్ళిముండ నాకుభార్యా యేవిఁటి?
రామ—రెండో పెళ్ళిముండేవిఁటి?
లుబ్ధా—రెండో పెళ్ళిముండ అని నువ్వే అన్నావు?
రామ - మాటమీద మాటొచ్చి, వొట్టినే అంటే. అదో ఒప్పా?
లుబ్ధా—వొట్టినే అనలేదు. గట్టే అన్నావు. యిదంతా, ఆగుంటూరు శాస్త్రుల్లూ నువ్వూ చేసినకుట్ర; నాకు నిజం తెలిసిపోయింది. ఆముండ నీయింటికే వెళ్ళింది. మధురవాణిని వుంచుకున్నట్టు దాన్నికూడా నువ్వేవుంచుకో. నా జోలికిరాకు. నీకు పదివేల నమస్కారాలు.
రామ—నాకంటె నాకియ్యకుంటే యీవెఱ్ఱి పెఱ్ఱిమాట లేవిఁటయ్యా?
లుబ్ధా—నీమాయగుంటా, నీకంటా, నీయింట్లోనే వున్నాయి.

రామ—యీవేషాలు నాకు పనికిరావు, నిలశెట్టి నాకంట వుచ్చుకుంటాను.

[తడిసిన భాగవతపుస్తకం పట్టుకుని మీనాక్షీ, చేతులో కఱ్ఱా, నెత్తిమీద వసుపురాసినకుండా, అందుమీద అఖండంతో అసిరిగాడూ, చేతిలో సీసాపట్టుకుని, తడిబట్టలతో పూజారి గవరయ్య ప్రవేశింతురు]

పూజా—హ్రాం! హ్రీం! హ్రూం! ఓంకార భైరవీ!

(రామప్పంతులు భయమును కనపర్చును)

మీనా—యక్కడా కనపళ్ళేదునాన్నా. యీపుస్తకం నూతులోపడేశింది.

(లుబ్ధావధాన్లు భయమును కనపర్చును)

రామ—కనపడకపోవడం యేవఁరు?

మీనా—నా సవిత్తల్లీ—గవరయ బాబు నూతులోదిగి అంతటా గాలించాడు. నూతులో మరేవీఁ కనపడలేదు.

(లుబ్ధావధాన్లు భయం తగ్గును)

బ్రహ్మరాతసిని గవరయ బాబు యీసీసాలో బిగించాడు నాన్నా.

(రామప్పంతులు సీసాకి యడంగా నిలబడును)

రామ—బ్రహ్మ రాతసి యేవిఁటి?

లుబ్ధా—వేరే—ఓ బ్రహ్మరాతసి వొచ్చి—మా అమ్మిని భయపెట్టింది.

మీనా—నన్ను కాదు—మా నాన్న పీకేపిసికింది.

రామ—గవరయగారూ, పిల్ల యామైఁనట్టు?

గవ—దాని మొగుడు యగరేసుకు పోయినాడు.

మీనా—యక్కడికి యగరేసుకు పోయినాడు? వాడు యీ సీసాలోనే వున్నాడన్నారే?

గవ—(కొంచం ఆలోచించి—చిరునవ్వునవ్వి) అదీ యీసీసాలోనే వుంది.

మీనా—మనిషి సీసాలోకి యలా వొచ్చింది?

గవ—అయ్యో సత్యకాలవాఁ! అది మనిషా అనుకున్నావు? అది కామినీ పిశాచం. అంచేతనే నేను మీయింటికొచ్చి నప్పుడల్లా దూరంగా వెళ్ళిపోయేది, యేమి చెప్మా, అనుకునే వాణ్ణి.

మీనా—యిద్దర్నీ ఓ సీసాలో పెడితే దెయ్యప్పిల్లల్ని పెడతారేమో?

గవ—పంతులుగారూ చిత్తగించండీ, రెండు మనుషుల బలువుందోలేదో చూడండి.

రామ—మొఱ్ఱో! నాదగ్గిరకి తేకయ్యా.

గవ—అసిరిగా నువ్వు పట్టుకో.

అసి—నాకు బయవేఁటి? పైడితల్లి చల్లగుండాలి—(సీసాపట్టుకుని) ఓలమ్మ! యంతత బలువుందోస్సి!

గవ—సీసా, అఖండం, తులిసికోట దగ్గిరడించు,

లుబ్ధా—బాబ్బాబు! సీసా నాయింట్లో పెట్టకు. మీయింట్లో పెట్టించండి.

గవ—మాపిల్లలు తేనెసీసా అని వీరగడా తీసినట్టాయనా, రెండు దెయ్యాలూ వొచ్చి మళ్లీ మీయింట్లోనే వుంటాయి.

లుబ్ధా—అయితే, సీసా భూస్థాపితం చెయ్యండి.

గవ—భూస్థాపనం మజాకాలనుకున్నారా యేమిటి? భూస్థాపితం చెయ్యడానికి యెంత తంతుంది! పునశ్చరణ చెయ్యాలి, హోమం చెయ్యాలి, సంతర్పణ చెయ్యాలి

లుబ్ధా—నాయిల్లు గుల్లచెయ్యాలి!

గవ—మీకలా తోస్తే నాకేంపోయింది? యీ మూతతీసేసి, నామానాన్న నేను వెళ్లిపోతాను.

లుబ్ధా—మూతెందుకు తీసెయ్యడం. నాకు కలిగినది తృణమో కణమో యిస్తాను. మూత తియ్యకుండా ఆసీసా అలావుంచి వెళ్లండి.

పూజా—యేమి అవధాన్లుగారి గడుస్తనం! నేపోగానే మూత పెట్టడానికా యెత్తు! ఆసీసా తగిన శాంతిచెయ్యందే భూస్థాపితం చేశారంటే, నేను రౌరవాదినరకాలకి పోనా? యిప్పుడే వీరగడా తీసేస్తాను,

లుబ్ధా—తియ్యకు, తియ్యకు. రేపు ఆశాంతేదో జరగేతుగాని.

గవ—అల్లాగైతే, యీ రాత్రల్లా యీ సీసా దగ్గిరపెట్టుకు పెరట్లో పడుకుంటాను, మీరు వెళ్లి నిర్భయంగా పడుకుని నిద్రపోండి.

(నిష్క్రమించును)

రామ—మావాఁ! ఓమాట.

(రామప్పంతులూ, లుబ్ధావధాన్లూ పక్కకు వెళ్లి మాట్లాడుదురు.)

రామ—నాకంటె మాటేమిటి, మావాఁ?

లుబ్ధా—మీకంటె మీయింట్లోనేవుంది.

రామ—మీ పెళ్లాం మాయింటికి వెళ్లిందని మీరంటున్నారుగాని, అక్కడికి అప్పీ రాలేదు, కంటా తాలేదు.

లుబ్ధా—అయితే యేమైందో! నాకేం తెలుసును?

రామ—వొద్దు సుమండీ—నాకంటె నాకిచ్చెయ్యండి—నేను మా కానివాణ్ణి.

లుబ్ధా—కంటె, గింటె, నాకు తెలియదు.

రామ—నీకు తెలియకపోతే మరెవరికి తెలుసును? గవరయ్య, నీపెళ్లాం దెయ్యమైందన్నాడుగదా? నువ్వూ నీకూతురూ కలిసి దాన్ని చంపేశారుకాబోలు.

లుబ్ధా—ఓరి! గాడిదకొడుకా (కఱ్ఱతో కొట్టబోవును.)

రామ—నాకంటె అపహరించావుగదా? నీపని పట్టిస్తాను వుండు. (నిష్క్రమించును)

లుబ్ధా—(తనలో) కంటె యేమైనట్టు చెప్మా? (పైకి) అమ్మీ!

మీనా—యేం నాన్నా?

లుబ్ధా—కంటె యేంజేసిందే?

మీనా—యేంజేసిందో? పెట్లో దాచిందేవోఁ? దాని వొంటినే వుందిగాబోలు నాన్నా?

లుబ్ధా—వొంటినుంచే—దెయ్యానికి కంటెందుకూ?

మీనా—యేం? తీపు దిగదీసిందా యేవిఁటి? పెట్టుగుంటుంది.

లుబ్ధా—నూతులోదిగి గవరయ్య నుయ్యంతా గాలించాడూ?

మీనా—గడియసేపు గాలించాడు.

లుబ్ధా—నువు చూశావూ?

మీనా—చూశాను.

లుబ్ధా—అది రావఁప్పంతులు యింటికే వెళ్లిందేమోనే?

మీనా—గవరయబాబు, సీసాలో బిగించాడుగదా యలా వెళుతుంది?

లుబ్ధా—యేమో నాకేంపాలుపోకుండావుంది. రా పరుందాం—మన ప్రారబ్ధం యిలావుంది.

(నిష్క్రమింతురు)

## ౨-వ స్థలము : రామచంద్రపురం అగ్రహారంలో సారాదుకాణం వెనకతోట.

[ఆ తోటలో కాళీమందిరం యెదటి మంటపం మంటపంలో కాళీ విగ్రహానికి యెదురుగుండా ఒక పెద్ద పీటమీద మూడు సీసాలతో సారాయి; చుట్టూ గళాసులు. పీటనిండా పువ్వులదండలు, మంటపంలో వకవైపు పులిచర్మంమీద యోగదండము ఆనుకుని సమాధిలో వున్న వొక బైరాగి; యోగిని యొకతె సారాయి అందరికీ అందిచ్చును. గ్రామ మునసబు సోమినాయుడు చిలుంపీల్చుచుండును. సాతానిమనవాళ్ళయ్య, జంగం, శిరేశ, దుకాణదారు రామందాను చెదిరికూర్చుందురు.]

మునస—ఆకాశం ముందుపుట్టిందా? బూవిఁ ముందుపుట్టిందా?

మనవాళ్ళయ్య—సుత్తిముందా కారుముందా?

మునస—పంగనావాఁలుముందా పట్టెవర్ధనాలుముందా? నామాలోడా నా సవాలేటి? నీ జవాబేటి? ఆకాశానికి మట్టాబూవిఁ? బూవిఁకి కప్పా ఆకాశం? నదువుకున్నోడెవడో సెప్పండొస్సి—,

మనవాళ్ళయ్య—ఆకాశంబు శూన్యంబు అనగా యేమీ లేదన్నమాట,

మునస—యేటీలేదా? గుడ్డోళ్ళకి యేటీలేదు. తెల్లోడు యెర్రోడా? పట్టంలో, గొట్టాం వెట్టి అదేసూస్తాడే ఆకాశం కాని?

మనవాళ్ళయ్య—శాస్త్రంబులలోని రహస్యంబులు మ్లేచ్ఛులకెట్లు తెలియును?

మునస — అల్లాండం, బెల్లాండం, శక్కరపొంగలి తినడవనుకున్నావా, నామాలోడా ? తెల్లోడి మహిమ నీకేటి తెలుసును ! తెల్లోడి సారాయికి, తెనుగోడి సారాయికి యెంతభేదంవుందో, తెల్లోడికీ నీకూ అంతభేదంవుంది.

మనవాళ్ళయ్య — గణితశాస్త్రంబునం దాకాశంబనఁ సున్న — సున్న యన శూన్యంబు-యేమీ లేదన్నమాట.

వీరేశ — చాత్రంలో మన్ను, మిన్ను, అని అన్నాడు కాడా ? మన్ను లేదా ? మన్నుంటే మిన్నుండదా ?

మునస — యీరేచ మా మేలయిన పలుకు పలికినాడు.

వీరేశ — "ఆకాశం బొక్కడ్డది!" అంటురు గదా, ఆకాశం లేకుంటే బొక్కడ్డ వెలాగ ?

మునస — శబాసు యీరేచ ! నామాలోడు పలకదేం ? నోరు కట్టడ్డది.

వీరేశ — (శంఖం పూరించును.)

హెడ్డు — (దుకాణదారునితో) యేవిఁటీ అల్లరిభాయి ?

మునస — యీరేచం గెల్చుకున్నాడుగదా, చంకం వోగించడా ?

దుకా — గురోజీగారి సమాదికి బంగంవొస్తే శపించిపోతారే ?

బైరాగి — (కళ్ళుతెరచి) శివబ్రహ్మాం ! శివబ్రహ్మాం ! శివోహం !

వీరేశ — చూచావు నేస్తం, చివ్రబెమ్మం అన్నారు.

బైరాగి — రామబ్రహ్మాం ! రామబ్రహ్మాం ! రామోహం !

మునస — మొదటిమాటను రెండవమాట రద్దుచేయును. రామానుజ ! రామానుజ !

వీరేశ — చివచివా ! చివచివా !

దుకా — యెందుకు కాట్లాడతారు. నీ శివుఁడూ నిజవేఁ, అడుగో ఆశీసాలో యెలుగుతున్నాడు. నీ రాముఁడూ నిజవేఁ, అడుగో ఆశీసాలో యెలుగుతున్నాడు. వినలేదా శత్తం ?

గాజుకుప్పెలోను గడగుచుదీపంబు ।
యెట్టులుండు గ్యానమట్టులుండు ।
తెలిశినట్టివారి దేహంబులందును ।
యిశ్వదాభిరామ యినరవేమా ॥

బైరాగి — సత్యం, సత్యం.

దుకా — గురోజీ ! తమకి అంతా యిశదవేఁ ! దేహం గాజుకుప్పె, దేహంలో వుండేదివరవాఁత్మ గాజుకుప్పెలో వుండేది అన్నసారం. యీఅన్నసారం దేహంలో పడితేగాని పరవాఁత్మ వెల్గించదు. యేం శలవు ?

బైరాగి — యీ పరమరహశ్యం నీకు యెలా తెలిసింది తమ్ముడా?

దుకా—తమవంటివారి ద్రయవల్ల గురూ! (నలుగురివైపూ చూసి) చూశారాబావాయీ నేను యెప్పుడూ యీమాటేగదా చెపుతూవుంటాను? అథాడాకి వొస్తేగాని పరబ్రెమ్మం పట్టుపడ్డం యేలాగు?

బైరాగి—అమృతమనేది యేమిటి? సారాయే! నాడు యిదేగదా తాగడానికి దేవాసురులు తన్నుకుచచ్చారు?

వీరేశ—చివచివా! చివచివా!

మనవాళ్ళు—రామానుజ—రామానుజ!

మునస—కాట్లాటమాని ఘానం యినండొస్సి. యెఱ్ఱిగొల్లోళ్ళు.

హెడ్—గురూ, మరివొక రసలింగం చేయించి, సిష్యుడికి దయ చెయ్యాలి.

బైరాగి—అలాగె.

మునస—గురూ! బంగారం సేస్తారుగదా, అదెట్టి. హారిద్దొరంలో మటం కట్టించక మాలాటోళ్ళని డబ్బెందు కడుగుతారు?

బైరాగి—మేం చేసే స్వర్ణం మేవేఁ వాడుకచేస్తే తలపగిలిపోతుంది.

హెడ్—అవి వేరే రహస్యాలు వూరుకోండి మావాఁ! గురోజీ! హరిద్వారంలో చలి లావుగాబోలు?

బైరాగి—నరులకక్కర్దు—మాబోటి సిద్ధులకు, చలి, వేడి, సుఖం, దుఃఖం, యెక్కడివి—

హెడ్—అహా! అదృష్టవంఁతె సిద్ధుల్దే అదృష్టం.

మునస—గురు, హారిద్దోరంచింది యెప్పుడు బైలెల్లోరు?

బైరాగి—రెండురోజులయింది. మొన్న ఉదయం ప్రయాగ, నిన్న వుదయం జగన్నాథం సేవించాం. ఖేచరీగమనమ్మీద ఆకాశమార్గాణ్ణన్న పోతూవుండగా మీ వూరి అమ్మవారు వనందగ్గిర గమనంనిలిచిపోయింది. యేమిచెప్మా! అని యోగదృష్టిని చూచేసరికి అమ్మవారి విగ్రహముకింద నిలువులలోతున, మహాయంత్రం వొకటి స్థాపితమై కనపడ్డది. అంతట భూమికి దిగి, అమ్మవారిని సేవించుకొని, ప్రచ్ఛన్నంగా పోదావఁంటూంటే, యీ భక్తుడు మమ్మల్నిపోల్చి నిలిపేశాడు.

దుకా—చూడగానే, నేను సిద్ధుల్ని పోలుస్తానుగురూ—

మున—సుక్కేసేవోళ్లని మాబాగా పోలుస్తావు. మా వూరమ్మోరు జగజ్జనని! మా చల్లనితల్లి.

బైరాగి—బ్రహ్మోస్మహం! బ్రహ్మోస్మహం!

హెడ్—అహా! యోగమహాత్యం! స్తానాల్చేసి, ముక్కుబిగించే బ్రాహ్మలకి లేవుగదా యీ సిద్ధులూ?

బైరా—వేషానికీ—జ్ఞానానికీ. దూరంకాదా తమ్ముడా? మాతాతగారు చెప్పలేదా "ఆత్మశుద్ధిలేని యాచార మదియేల" అని?

హెడ్ — వేమన్న — తమతాతా, గురూ?
బైరాగి — అవును — వారు పరంపదించి ఆరువొందల సంవత్సరాలు కావొచ్చింది.
హెడ్ — తమవయస్సెంత గురూ?
బైరాగి — అది అంతూ లేనిదానికి లెఖ్ఖేవిఁటి తమ్ముఁడా? పరమాత్మ కెన్నోళ్లో అన్నేళ్లు
మునస — యేం యిలవైన మాటలింటున్నాం!

(వీరేశ శంఖం పూరించును)

హెడ్ — (శంఖంలాక్కొని పక్కనుపుంచి) అట్టె పట్టెయ్యకండి భాయి.
దుకా — అట్టే యక్కడభాయీ? పరవశవైఁవఁదాకా తాక్కుంటే తాగడవేఁటి? వేమన్న చెప్పలేదా?

"తాగి, తాగి, తాగి ధరణిపైబడుదాక ।
తాగనేని వన్ను, తాను తెలియు॥
తాగలేనివాఁడె, తాగుబోతరయంగ ।
యిశ్వదాభిరామ యినరవేమ॥

బైరాగి — కాశీలో రెండువందల యాభై సంవత్సరములక్రిందట అలంగీర్ పాదుషా వారి హయాంలో, ఒకశేటు మాబోటి సిద్ధులనందరిని కూటానికి పిలిచాడు. గంగనడివిఁని పడవమీద పీపాలలో సారాయి భరాయించి, బంగారపు గిన్నెలతో అందిచ్చాడు. రెండుఝాములరాత్రి అయేసరికి పీపాలు కాలీ అయి పోయినాయి. అంతా పడిపోయినారు.
హెడ్ — యేమి ఆశ్చర్యం!
బైరాగి — మేమూ, ఒక్క నేపాళపు బ్రాహ్మఁడూ మిగిలాం. "తే! తే!" అన్నాఁడు. ఆ బ్రాహ్మఁడు "తెస్తావా శపించేదా" అన్నాఁడు. శెట్టి యెక్కడ తెస్తాఁడూ? వాఁడు మాకాళ్ళు పట్టుకునేటప్పటికి పర్వాలేదు నిలవమని చెప్పి, మేము ఒక పుడిక మంత్రించి, గంగభరాయించినకొద్దీ ఆగంగ సారా అయిపోయింది. ఆ బ్రాహ్మఁడు సహస్ర పుడికలుతాగి జిట్టునతేన్చాఁడు. బ్రాహ్మల్లోకూడా మహాత్ములుంటారు. కనుక్కోఁగలిగిన జ్ఞానికి గంగానది అంతా సారాయికాదా?
మునస — రామందాసొహాడు, గంగ బరాయించడానికి గురువు; ఒకదరావుఁకి పద్ద రావుఁలు సేరుస్తాడు.

[హవల్దారు అచ్చన్న ప్రవేశించును]

దుకా — గురూ వీరు హవల్దార్ అచ్చన్నగారు. మంనిగ్యాని, మునసబుగారికి మేనల్లుఁడు.
హవ — రామ్! రామ్!
బైరాగి — రామ్! రామ్!
హవ — (యోగినితో) పిల్లాహుక్కాలావ్. (హెడ్‌తో) భాయీ గుంటూరు శాస్తుల్లుగారి పకాయేమైనా తెలిశిందా?

హెడ్ — లేదుభాయి.

మకా — రామప్పంతులంటాడు-పెళ్ళికూతురు రెండోపెళ్ళి పిల్ల-దాన్ని అమ్మి డబ్బు చెయ్యిచిక్కించుకుని—

హెడ్ — ఆమాటలు మనకెందుకు భాయి?

మునస — పోలీసోళ్లకి అక్కర్లేక, బాపనోళ్ళకీఅక్కర్లేక. యెదవ ముండని బాపనాడు పెళ్ళి శేసుకుంటే లోకం అంతా వూరుకోవడవేఁనా?

హెడ్ — డబ్బు యిచ్చినవాడికీ, పెళ్ళి ఆడినవాడికీ లేనిచింత మనకేల మావాఁ? కాక, యీరోజుల్లో బ్రాహ్మణ్యం యెక్కడుంది! యెక్కడ చూశినా పిల్లల్ని ముసలాళ్ళకి అమ్ముకోడాలు-రంఢాగభాఀలేకదా?

హావ — కలికాలంగదాభాయీ? యెంతచెడ్డా బ్రాహ్మలు మనకి పూజ్యులు.

హెడ్ — అన్నా, యెవరంతవారు. వారు. జ్ఞానం, నీతి ప్రధానంగాని, జాతిలో యేవుంది? వేమన్న యేవఁన్నాడు?

మునస — యేవఁన్నాడా! నీతికి పోలీసోణ్ణి, ఘోసానికి సాతానోణ్ణి అడగమన్నాడు.

హెడ్ — మావాఁ! వెక్కరించండిగాని, నేను యెన్ని తాలూకాల్లో నౌఖరిచేశానో అన్ని తాలూకాల్లోనూ రంఢాగభాఀలు యెన్నని చెప్పను! నన్నడిగితే వెధవలు పెళ్ళిచేసుకోవడవేఁ ఉత్తమం అంటాను. మా సూపరెంటు పిల్లలతో వున్న రెండోపెళ్ళి దొరసాన్ని పెళ్ళాడి సుఖంగా వుండలేదా?

మునస — మావఁగారి అభిప్రాయం. పెయ్యతోటొచ్చిన ఆవు మేలుకాదా అని? అందకనే, ముసలిబాపనోడు యెధవగుంటని పెళ్ళాడితే, మీ నేస్తం కరణపోణ్ణి ఆ ముసలాడి యెధవకూతుర్ని పెళ్ళాడమని బోదసెయ్యరాదా?

హావ — మనకేల మావాఁ? గవునర్‌మెంటూ, దేవుళ్ళూ బ్రాహ్మలూ—వారి నేరాలు వారివి — వాటితో మనకిపనిలేదు. మనభక్తి మనకుండాలి. (హెడ్‌తో) భాయీ తెల్లానల్లా వొకటా?—తెల్లవాడికి క్రీస్తు వొక పద్ధతి పెట్టాడు. ముసల్‌మాన్‌కి పైగంబరు వొక పద్ధతి పెట్టాడు. నల్లవాడికి రాముడు నొక పద్ధతి పెట్టాడు. భగవంతుడు తెల్లవాడితో యేవఁన్నాడూ? వెధవని పెళ్ళాడు అన్నాడు. రాముడు తెనుగు వాడితో యేవఁన్నాడూ? వెధవని పెళ్ళాడొద్దన్నాడు. చెప్పన్న దేశాలూ చూశాను భాయీ, వరివరివిధాలు ఆచారాలూ వ్యవహారాలూ వున్నాయిగాని నీతి వకటీ, భగవంతు డొకడూ, అంతటా వక్కటే.

మునస — రాముడు యెదవముండల్ని కాని పనులు సెయనున్నాడూ? మన్లో మారు మనువులుండేవి కావా?

హావ — పిల్లా, చిలుం భరాయించి, తే.

మునస — నామాలోడు మూలకి తీసికెళ్ళి పిల్లని ముద్దెట్టుకుంటున్నాడు

యోగినీ— (చెయ్యి విడిపించుకొని సిగ్గుతో) ఏకాంత ఉపదేశం చేస్తున్నారు.
మునస— యేటో ఆవుప్పుదేశం? తనెంట వాయు యేగంగా రమ్మనా?
దుకా— యేవిఁటీ భాయీ, అనరానిమాట్లు అంటున్నారు, మన యోగినివరమభక్తురాలు.
మునస— లెంపలోయించుకుంటాను. పిల్లా! ఆనామోలోడు సెప్పిన ఉప్పుదేశవేఁటో నా సెవులో కొంచం సెప్పరాదా?

(యోగిని సారాగళాసు హవల్దార్ యెదటవుంచును.)

మునస— నామాలోడి వుప్పుదేశంతో పిల్లకి మతోయింది.
బైరాగి— హవల్దారుగారు అమృతం సేవించరా?
హవ— (చిరునవ్వునవ్వి) తాక్క సోజరువాడు చెడ్డాడు, తాగి సిపాయివాడుచెడ్డాడు. జ్ఞానికి జ్ఞానపత్రి; తాగుబోతుకు సారాయి.
మునస— పించను పుచ్చుకుంటుగి గదా, యింకా సిపాయీనా సెయ్యాల్నుందా అల్లుడోడా?
హవ— కుంపిణీ నమ్మాక్ తిన్న తరవాత, ప్రాణంవున్నంతకాలం కుంపిణీ బావుటాకి కొలువుచెయ్యాలి. రేపు రుషియాతో యుద్ధంవొస్తే పించను ఫిరకాయావత్తూ బజాన్ని తుపాకీ వెయ్యమా?
మునస— రుస్సావోడివోడ నిట్లోములిగి నడుస్తాది గదా, నువ్వు తుపాకుతో యవణ్ణి కొడతావు!
హవ— మొన్నగాక మొన్న యింగిరీజ్ రుషియా దేశానికి దండెత్తి పోయి రుషియాని యెన్ని తగలలేదా? అప్పుడేవైఁందో, యిప్పుడూ అదే అవుతుంది. మా రాణీ చల్లగావుండాలి.
దుకా— సీవఁరాణీ ఆకాళీమాయి అవుతారం కాదా?
హవ— కాళీ, గీళీ, జాంతేనై - ఆ రాముడి అవతారం.
దుకా— గురూ—హవల్దారుగారు తత్తకీర్తనలు మాయింపుగా పాడతారు. (యోగినితో) తల్లి, నా తంబూరాతెచ్చి భాయిగారికి ఇయ్యి.
మునస— యీతూరి, యీరేచ వుప్పుదేశం చేస్తున్నాడు.
దుకా— గొప్పవారున్నప్పుడు ఆస్యాలేటి భాయీ?
మునస— వున్నమాటాడితే ఆస్సాలా? నా కెవడూ సెయదేం వుప్పుదేశం? యీరేచ వుప్పుదేశం గట్టిగాయిగిసింది; మరిసెయ్యోదల్లు—

(యోగిని కష్టంమీద చెయ్యిని వొదలించుకొని తంబురా తెచ్చి యిచ్చును.)

దుకా— అవన్నీ గ్యానరహాశ్యాలు. బ్రెమ్మానంద వఁంటె యేటి? కడుపు నిండాసారా ముక్కునిండా పొగ; పక్కని పడుచుపిల్లా కదా?
మునస— ఘానం యినండొస్సి,—

హవ—పామరం! పామరం! రాముడు వలెం కాళీ నెత్తిమీద పెట్టకపోతే కుంపిణీ సిపాయన్నవాడు యిక్కడికి వొచ్చునా?
హెడ్—భాయి! ఓ కీర్తన కలవియ్యండి.

(హవల్దారు పాడును)

పింజర్మేరహాకర్ ఛుప్ నైరహ్నా
క్యారేబుల్బుల్ కహా ముల్కినునా క్యారె॥
యెక్కడికివెళతావు? యేమి చెప్పవు, బోలోపింజర్మె।
(వీరేశశంఖం మనవాళ్ళయ్యాతని పూరించును.)

హవ—(పాటమాని. తంబూరా క్రిందబెట్టి) గద్దా!
హెడ్—(శంఖులాక్కొని) శంఖం అగ్గిలోవదేస్తాను, యెందుకు తానిస్తావుభాయి?
దుకా—వొద్దంటే వినడు.
హెడ్—వినకపోతే దుకాణానికి రానియ్యకండి. అల్లాగైతే మాకు మాటకదా?
దుకా—పదిశంఖాలు దాచేశాను; మళ్ళీ మళ్ళీ తెస్తాడు. యేం సెయ్యను. వేరంగదా భాయీ?
మునస—దిట్టంగా పట్టెయి. తత్ఘ్రావం తలకెక్కాలి!
దుకా—(తంబురా తీసిపాడును.)

నాగాదిగరా। నాతండ్రిదిగురా॥
దిగుదిగునాగన్న। దివ్యసుందరనాగ।
ముదముతో రేవల్లె। ముద్దులనాగ॥
ఊరికిఉత్తరాన। ఊడలమఱ్ఱికింద
కోమ పుట్టలోని। కోడెనాగన్నా॥

[పాడుచుండగా రామప్పపంతులు ప్రవేశించి యెడంగా నిలిచి యోగినికి సౌజ్ఞచేయును యోగిని రామప్పపంతులుతో మాటాలాడివచ్చి హెడ్ చెవిలో రహస్యం చెప్పును.]

మునస—పిల్లా, హెడ్డుగారికి పువ్వుదేశం నేస్తూంది. మునలోజ్ఞానా—
యోగిని—(మునసబు చెవిదగ్గిర నోరుపెట్టి చెవిగిల్లును.)
మునస—పిల్లా! సాత్రోజులైంది మునిసిబు నాయుడికి యీపాటి పువ్వుదేశంతగిలి—
(హెడ్డుకనిష్టీబు రామప్పంతులు దగ్గరకువెళ్ళి యెడంగా యిద్దరూ మాటలాడుదురు)
హెడ్—కొత్తవారు యవరూతేరే? బావాజీగారు వుంటే మీకు భయవేవిఁటి?
రామ—కొత్తా, పాతా, ఆలోచించుకోలేదు. కొంపమునిగింది. మీసాయం కావాలి—
హెడ్—దక్షిణెవైనా వేల్తుందా?
రామ—మీ చాతైతే, వేల్తుంది.

హెడ్ — యేమిటొచ్చిందో చెప్పు,

రామ — లుబ్ధావుధాన్లు పెళ్ళాడినగుంట మధురవాణి తాలూకు కంటె తీసుకుని యెక్కడికో పారిపోయింది,

హెడ్ — యెందుకు పారిపోయిందో ?

రామ — మీనాతీ చావగొడితే పారిపోయింది, యెక్కడ వెతికినా కనపడ లేదు. ముందు మీ జవాన్లని దౌడా యించండి.

హెడ్ — యీ రాత్రివేళ మా జవానుమాత్రం పట్టుకోగ లా ? పోలీసు జవానంటే పది కళ్ళూ పదికాళ్ళూ వుంటాయనుకున్నావా యేవిఁటి ?

రామ — దాని సిగ్గోసిరి; దాన్ని పట్టుకోవడం నాకెందుకు. నా కంటె నా కిప్పిం చెయ్యండి ?

హెడ్ — యేవిఁటి నీమాటలూ ! ఆకంటె పట్టుకు ఆ పిల్ల పరారీ అయిందని చెపితివి. నేను కంటె యెలా యిప్పిస్తాను ?

రామ — ముసలాణ్ణి అడిగితే, అదిపట్టుకు పోయిందంటాడు; గాని నిజంగా వాడు పెట్టెలో దాచేసి యివ్వకుండా వున్నాడు.

హెడ్ — నన్నేంచెయ్యమంటావు ?

రామ — కూనీకేసని ముసలాణ్ణి బెదిరిస్తే, నా కంటే నాకిచ్చేస్తాడు; మీ చెయ్యికూడా తడౌతుంది,

హెడ్ — అలాగనా — గాని నువ్వన్నట్టు ఆ పిల్లగానీ, కంటె పట్టుకు పరారీ అయి పోయివుంటే.——

రామ — పోనిండి—దాని ఖరీదు యిప్పించెయండి.

హెడ్ — వాడిస్తాడా ?

రామ — మరి మీసాయం యెందుకుకోరాను ?

హెడ్ — యిస్తాడని నాకు నమ్మకంలేదు ఐనా చూస్తాను, కేసని యెత్తు యెత్త డానికి యిద్దరు ముగ్గురు సాతులుండాలి ?

రామ — మందిరంలో వున్న వాళ్లో ?

హెడ్ — వీరేశం, మనవాళ్ళయ్యా, మూడో కాలంలో వున్నారు. హావల్దారు అబద్ధం ఆడమంటే తంతాడు. మునసబు నాయుడు యింతరాత్రివేళ అంతదూరం నడిచి రాలేడు. యిహ ఆడనూ పాడనూ రామందాసు వొక్కడేగదా ?

రామ — ఆభైరాగాడు సాక్ష్యం పలకడేం ?

హెడ్ — వేషంవేసుకు ముష్టెత్తుకునే భైరాగా డనుకున్నావా యేవిఁటి ? ఆయన గొప్పసిద్ధుడు, నిలువెత్తు ధనంపోస్తే అబద్ధమాడ్డు,

రామ — సాక్ష్యం పలకాఒద్దు, యేవీఁవొద్దు, దగ్గిరనిలబడితేచాలును. పిల్చుకురండి ?

(కనిష్టీబు వెళ్ళి దుకాణదారుతోనూ భైరాగిని తీసుకువచ్చును.)

బైరా—సాక్ష్యంఅంటే మావంటివాళ్ళే చెప్పాలి. యోగదృష్టివల్ల చూశావఁంటే యెక్కడ జరిగినదీ యెప్పుడు జరిగినదీ కళ్ళకి కట్టినట్టు అప్పుడు కనపడుతుంది. గనక మేఁకూడా వస్తాం. యెవరైనా దొరికితే హరిద్వారంలో మఠానికి పని కొస్తుంది.

రామ—జరిగినదాని ముండామోశిరి. కొంచం కల్పనుంటేగాని కథనడవదు. అందేత హేడ్డుగారు ముసలాడితో చెప్పేమాటలు నిజం అని మీరు శెలవివ్వాలి.

బైరా—వెఱ్ఱీ! వెఱ్ఱీ! నిజవేఁవిటి, అబద్ధవేఁవిటి! మేం సిద్ధులం. అబద్ధం నిజం చేస్తాం. నిజం అబద్ధం చేస్తాం — లోకవేఁ పెద్ద అబద్ధం. పదండి.

(నిష్క్రమింతురు.)

## ౫-వ స్థలము : దేవాలయం గుమ్మందగ్గిర.

[హెడ్డుకనిష్టీబు, రామప్పంతులూ మాట్లాడుతుందురు మరివక కనిష్టీబు, బైరాగి, దుకాణదారు కొంత యెడముగా నిలుచుందురు.]

హెడ్—నా నౌఖరీ పోగొట్టుకుంటానా భాయీ?

రామ—కొంచం బెదిరిస్తే నౌఖరీ పోతుందా అన్నా? పోలీసుద్యోగీ అంటే బెదిరింపే గదా? మీరు అలా తప్పించుకుంటే నేనేం అనుకోను?

హెడ్—(చేతిలో నులుపుతున్న కాకితపుముక్కను విసిరేసి) భాయీ. లుబ్ధావుధాన్లు చంటిపిల్లడా? దుక్కిముచ్చా? బెదిరించడానికి—కూనీ కేసని నాకేవైఁనా ఆశవుంటే, పోలీసువాణ్ణి, నేను వూరుకుంటానా? పట్టుకుంటే నాకు యెంత కారకట్టుకాదు? యీ జనాన్ని యీ చీకటి రాత్రిలో నూతిలో దింపానుకానా? కూనీ గీనీ అంటే యవరైనా నవ్వుతారు. మీనాక్షీచేతికి వెరచి, ఆపిల్ల యిరుగింట్లోనో పొరుగింట్లోనో పడుంది మీయింట్లోనే వుందేమో ముసలాడు అన్నట్టు?

రామ—దేవుఁడుతోడు మాయింటికి రాలేదు. యిరుగింటో, పొరుగింటో అని మీరు వూరుకుంటే యలాగ? మీ ధైర్యవేఁవిటో నాకు బోధపడదు. వెతికించవయ్యా అంటే, వెతికించారూకారు ఆ యిరుగింటివాళ్ళూ, పొరుగింటివాళ్ళూ. పిల్ల నిద్దరపోతూవుండగా కంటె చెపాయిస్తే నాగతేవిఁటి? కంటె యింటికి పట్టుకువెళ్ళకపోతే మధురవాణి గుమ్మంలోంచి గెంటుతుంది—అనగా, గెంటుతుందని కాదు—యేడుస్తుంది, ప్రాణం తినేస్తుంది. విన్నారా?

హెడ్—అయితే నా సలహావిన్నారా?

రామ—యేదో చెప్పండి మరి.

హెడ్—ఆకంటె యిచ్చిందాకా, కదలకుండా, లుబ్ధావుధాన్లు యింటిమీద కూర్చోండి.

రామ — యిదా సలహా? పీకమీద కూచున్నదాకా నాకేం పట్టింది? యింటికెళ్ళి సుఖంగా పడుకుంటాను.

హెడ్ — మధురవాణి బాధ పెడుతుందనికదూ?

రామ — అని మీకు కనికారం కాబోలు? రేపుగానీ వాడు కంటె యివ్వకపోతే, అవుధాన్లుమీద సివిల్ దావావేస్తాను. మీదగ్గిర, కంటెమాట వొప్పుకున్నాడు గదా మిమ్మల్ని సాక్ష్యం వేస్తాను.

హెడ్ — ఓహో యిదా వేషం? పోలీసు ఆఫీసర్ని నేను, సాక్ష్యాలకీ సంపన్నాలకీ తిరిగితే నా నౌఖరీ నిలుస్తుందా? కావలిస్తే లుబ్ధావుధాన్లు కంటె హరించాడని నాదగ్గిర ఫిరియాద్ చెయ్యండి. కేసు చేసి నా తమాషా చూపిస్తాను.

రామ — కంటెమాట మీదగ్గిర అతడు వొప్పుకున్నతరవాత, మీరు బోనెక్కి యలా అబద్ధం ఆడగల్రో చూస్తానుగదా;

హెడ్ — పంతులూ, అక్కరమాలిన శౌక్యాలుచెయ్యకు వాడు కంటెమాట తనకేవీ తెలియదన్నాడు. కావలిస్తే ఆమాట సాక్ష్యం పలుకుతాను.

రామ — యిదా మీరు చేసినసాయం?

హెడ్ — యెందుకు అక్కరమాలిన ఆందోళన పడతావయ్యా రేపు నీకంటె నీ యింట్లో వుండకపోతే నన్ను అను

రామ — మధురవాణితో యిప్పుడు యేంచెప్పను?

హెడ్ — అయితే నన్నేం జేయమంటారు?

రామ — మళ్ళీ లుబ్ధావధాన్లు యింటికిరండి. యీమాటు మన వీద్దరం వెళ్ళి పీడిద్దాం.

హెడ్ — రెడ్డొచ్చాడు, మొదలాడు అన్నాట్ట—నిరర్థకంగా రాత్రల్లా నిద్దర్లేకుండా చంపావు-మరి నేను రాజాలను. నువ్వెళ్ళి వాడియింటిమీద కూచోవయ్యా, అని చెప్పానుకానా? నామాటవిని అలా చెయ్యండి. అదే సలహా. పీసిరిగొట్టు ముండాకొడుకు మానలుగురికీ నాలుగుమూళ్ళు పద్యేందురాళ్ళు పారేశాడు. యివి పెగిలేటప్పటికి నా తల్రప్రాణం తోకకి వొచ్చింది. నావొంతు మూడూ మీకిచ్చేస్తాను.

రామ — కంటెపోయి యేడుస్తూవుంటే, యీవెధవ మూడురూపాయలూ నాకెందుకూ?

హెడ్ — మీకు అక్కర్లేకపోతే పోనియ్యండి, గురోజీగారికి యిద్దాం.

**రామ** — కొంచం చిల్లరఖర్చుంది. యేంజెయ్యను? యిలా పారెయ్యండి. (పుచ్చుకొనును.)

హెడ్ — గురోజీ తమకో తులసిదళం.

బైరా — తృణం, కణం యేవొచ్చినా మఠానికే అర్పణం.

హెడ్—(దుకాణదారుతోనూ, కనిష్టీబుతోనూ) మీకో మూడు. నీకో మూడూ— (చేతులు దులిపి) సాఫ్ ర్షూడా—నాకు తిప్పలే మిగిలింది.

దుకా—(బైరాగిని పక్కకిపిలిచి) యీవేళే చెన్నాపట్నంనించి ఫస్టురకం బ్రాందీ వొచ్చింది. చిత్తగించి మరీ కాశీ వెళుదురుగాని.

హెడ్—గురోజీ, రాం! రాం! పంతులూ ముసలాణ్ణివెళ్ళి పట్టుకోండి భాయీ, స్టేషనుకు పోవాలి. (జవానుతో) రావోయి కావఁయ్యా (హెడ్డూ, జవానూ, ఒక వైపున్నూ, దుకాణదారూ, బైరాగీ మరి వకవైపున్నూ వెళ్ళుదురు

రామ—కంటె పోయిందంటే మూడురూపాయలా చేతులో పెడతాడు! (విరసంగా నవ్వును) పీడితాళం పడతాను (హెడ్ పారేసిన కాగితపు ముక్కలు, యేరి) యిన్‌స్పెకటరుకివొకటి, తాసిల్దారుకి వొకటి, ఆకాశరామన్న అర్జీలు పంపుతాను, వెధవ, మధురవాణి దగ్గిరికి వెళతాడేమో ? నేను యింటికిపోతే అరుగుమీద పడుకోవాలి గాని ఆ తిక్కలంజ తలుపు తియ్యాదు లుబ్ధావధాన్లు యింటికివెళ్ళితే వాడు కట్టుచ్చుకుంటాడు. యీ దేవాలయంలో పరుందునా?— పురుగూ బుట్రా కరిస్తే-కరిస్తే—ఛీ! యీ సానిముండని వొదిలేస్తాను—ఆగుంట యేవైఁనట్టు ? నా అదృష్టంవల్ల యవళ్ళింట్లోనైన దాగి రేపుగాని కళ్ళబడితే, కంటెపోకూడదు ఒఁ వేళ చస్తే? — చచ్చుండదు — నూతులో పడలేదు. గవరయ్యా, కావఁయ్యాకూడాగాలించారు —ఒకవేళ అది రెండోపెళ్ళి పిల్ల అయి, దాని ఆ తండ్రి కానికీగావొచ్చి బండీ యెక్కుంచుకు పోడాయించాడేమో ? అలా ఐతే కంటె కూడా వుడాయించడా ?—మీనాక్షిని పట్టుకుంటే కొంత ఆచోకి తెలుస్తుంది — అది కనపడ్డ వెఁలాగ ?—తలుపు తట్టితే ముసలాడే వొస్తాడేమో ?—(రోడ్డుదాటి లుబ్ధావధాన్లు యింటి గుమ్మం యెదట నిలుచుని) ఆకలి దహించేస్తూంది — మీనాక్షి దొరికితే యేవైనా ఫలహారం యిచ్చును — యవడు చెప్మా! రావిచెట్టుకింద చుట్ట కాలుస్తున్నాడూ ? నాలుగు అడుగులు ముందుకు వెళ్ళి) అసిరీ, నువ్వా ?

అసిరి—నానుబాబు (చుట్టపారవైచును.)

రామ—నిమ్మళంగా వున్నావురా ?

అసిరి—యేటి నిమ్మళంబాబూ, సానమ్మొచ్చింది — ఈయమ్మ కాసి సూడం మానేసినారు. డబ్బిచ్చేదాతేడిబాబూ ?

రామ—అసిరి, అఁడక్కపోతే, అమ్మైనా పెడుతుందిరా ?

అసిరి—ఆసానమ్మ మా సెడ్డ మనిషి బాబూ.

రామ—యేవిఁటి ? యేవిఁటి ? చెప్పారే. చాలారోజులైంది నీకు డబ్బిచ్చి—యింద యీ రాపాయి పుచ్చుకో.

అసిరి—నూరు దండాలుబాబూ ?

రామ—మధురవాణి మాటయేవిట్రా చెప్పబోయినావు ?
అసిరి—మా పెద్దమనిషి బాబూ.
రామ—యవడెళ్లాడ్రా దాందగ్గిరకి ? అసిరి – యవడెళ్లాడ్రా
అసిరి—యవడెళ్లా, యీపు పెట్లగొడతాది బాబూ;
రామ—పెద్ద మనిషన్నావు ?
అసిరి—కాదా ? మొన్న పొద్దుగారెత్తే. యేపికూన్ని ఉపు గలిపింది కాదా ?
రామ—నిజం చెప్పావు. నీమీద యెప్పుడైనా కోప్పడ్డదిట్రా ?
అసిరి—మాలాటోళ్ళమీద యెంవ కోప్పడతాదీ ? బాపనాళ్ళొస్తే తిడతాది.
రామ—నువ్వు యెప్పుడూ నిజవేఁ చెబుతావురా అసిరిగా.
అసిరి – సీ ! అబద్దవాడితే బగమంతుడు ఒల్లకుంటాడా బాబూ ?
రామ—మీబుగత యేం జేస్తున్నాడ్రా ?
అసిరి—తొంగున్నాడు బాబూ.
రామ—నీకు మరోరూపాయి యిస్తాను – మీనాక్షిని సావిట్లోకి పిలుస్తావురా ?
అసిరి—నాశక్కవాఁ, బాబూ ? ఆ యమ్మ అయ్యగారితో పక్కేసుకు తొంగున్నారు
రామ—నువ్వు చిటికేస్తే, యక్కడున్నా లేచొస్తుంది. నే నెరగనట్రా,
అసిరి—తెండి బాబూ. సూస్తాను (రామప్పంతులు రూపాయి యిచ్చును, ఉభయులూ యింట్లో ప్రవేశింతురు,)

## 6–వ స్థలము : లుబ్ధావధాన్లు యింటివసారా.

[ తలుపు జారవేసి వుండును ]

[ మీనాక్షి ప్రమిదతో దీపం తెచ్చి గూటిలోవుంచును. రామప్పంతులు వొత్తి తగ్గించి, మీనాక్షిని ముద్దుబెట్టుకొనును.]

మీనా—తోవతప్పొచ్చారో ?
రామ—బుద్ధితక్కువచేత, గడ్డితిని యిన్నాళ్ళూ తోవమరిచాను.
మీనా—మధురవాణి యలా రానిచ్చింది ?
రామ—మధురవాణి శిగ్గోసిరి, దాన్ని వొదిలేస్తాను. ఆకలి దహించుకు పోతూంది. ఫలారం యేమైనావుందీ ?
మీనా—యేవుందీ ? – వొడపప్పూ, కొబ్బరిముక్కా- కావాలా ?
రామ—యేదో ఒహటితెస్తూ. (మీనాక్షి మూకుడుతో వడపప్పూ కొబ్బరిముక్కలూ తెచ్చును. రామప్పంతులు తినుచుండును.)
మీనా—మధురవాణ్ణి వొదిలేస్తారో ?
రామ—వొదిలెయడం నిశ్చయమైపోయింది.

మీనా—కనిష్టీబుమాట తెలిసిందో ?
రామ—తెలిసింది.
మీనా—యవరు చెప్పారు ?
రామ—అసిరిగాడు.
మీనా—మా అసిరిగాడా ?
రామ—మీ అసిరిగాడే.

(అసిరిగాడు వీధితలుపు కొంచంతీసి తొంగిచూసి)

అసి—దెయ్యానికెట్టింది తింతున్నావయ్యా ?
రామ—దెయ్యానికా పెట్టారు ?
మీనా—(అసిరిగాడితో) వూరుకో వెధవా.
రామ—నీకు న్యాయవేఁనా, దిగదుడుపు కూడుపెట్టకం ?
[వీధులోకి వెళ్ళి వమనము చేసికొనుటకు ప్రయత్నముచేసి తిరిగీ ప్రవేశించి]
వమన వైఁది కాదు. యేం సాధనం ?
మీనా—దిగదుడుపు కాదంటే నమ్మరుకదా;
రామ—మూకుళ్ళో తగలేశావు ?
మీనా—దెయ్యం తిని నచ్చిందా, యేవిఁటి ?
రామ—ఆడవాళ్ళు దారుణం మనుష్యులు !
మీనా—అసిరిగాడేం చెప్పాడు మధురవాణిమాట ?
అసి—(తిరిగీ తొంగిచూచి) ఆ పారేసిందట్టుకు పోదునా బాబు ?
రామ—పట్టుకుపో.

(అసిరిగాడు పట్టుకుపోవును)

మీనా—వాడికి మీకంటె ధైర్యంవుంది.
రామ—అపవిత్రం ముండాకొడుకు యేవైఁనా తింటాడు. బ్రాహ్మణం పవిత్రవైఁన వాళ్ళంగదా ?
మీనా—పవిత్రం అంటే, మీదీ, నాదే !
రామ—అదేం అలా అంటున్నావు ?
మీనా—నేను వెధవముండనీ పిండు నగసులున్నా, మనకంటే మరి పవిత్రం అయిన వారు యవరుంటారు ?
రామ—ఆ కళంకం తీసెయ్యడానికే యీవేళొచ్చాను.
మీనా—యలా తీసేస్తారు ?
రామ—మన యిద్దరం పెళ్ళాడితే మరి అపవిత్రత యెక్కడుంటుంది ?
మీనా—యేవిఁటీ !

రామ — మనం పెళ్లాడదాం ?
మీనా—నిజంగానా ?
రామ—యేంవొట్టు వేసుకొమ్మన్నావు ?
మీనా—అదీపం ఆర్పెయ్యండీ.
రామ—యీ కాగితం ముక్కలు చదివి మరీ ఆర్పేస్తాను. (కాగితం ముక్కలు జేబులోంచి తీసి చదివి) గాడిద కొడుకు తనబాకీ తాలూకు నోటులాగి, నన్ను దగా చేశాడు; వీడి కితాళం పడతాను
మీనా—యవడు ?
రామ—అది వేరేకథ.
మీనా—అసిరిగాడు కనిష్టీబుమాట యేం చెప్పాడు ?
రామ—మధురవాణి పెద్దుమీద కుక్కని వుసిగలిపించని చెప్పాడు.
మీనా—యెందుకూ ?
రామ—నేను లేనప్పుడు వాడు యింట్లో చొరబడబోతేను.
మీనా—అయ్యో తెలివా ! అసిరిగా !
అసిరి—(ప్రవేశించి) యేటమ్మా ?
మీనా—వెధవా, నిజంచెప్పు. పంతులు యింట్లోలేనప్పుడల్లా కనిష్టీబు మధురవాణితో వుంటాడని, నువ్వు నాతో చెప్పలేదూ ?
అసిరి—(బుఱ్ఱగోకుకుంటూ) సెప్పినాను
రామ—దొంగవెధవా ! కుక్కని వుసిగలిపించన్నావు ?
అసిరి—బాబు - నౌకరోడు నోరుమూసుకోవొద్దా బాబు? సానమ్మడిగితే, మీ మాట సెప్పుతానబాబు ?
మీనా—వెధవా, నువుచెబితే నాకు భయవనుకున్నావా యేవిటి ?
రామ—ఓరి అబద్ధపు వెధవా ! యెవరితోనూ మామాటమాత్రం చెప్పకు. రూపాయి యిచ్చానుకానూ ?
మీనా—యందుకిచ్చారూ, రూపాయి ?
అసిరి—పిల్లలోణ్ణిగందా ? (పైకి వెళ్ళును.)
రామ—దొంగముండ ద్రోహంచేస్తూందేం ?
మీనా—తెలుసునన్నారు ?
రామ—యింతని యెరగను.
మీనా—ఆడది నీతి తప్పినతరవాత అంతేవిటి ? యింతేవిటి ? తెగించినదానికి సగుడు మొకాలుబంటి- అందులో సాంది ఖాయిదాగా వుండాలనుకోవడం మీదీ బుద్ధితక్కువ.

రామ—బుద్ధితక్కువంటే బుద్ధితక్కువా! ముండని బుఱ్ఱ చితకపొడిచెయ్యాలని వుంది, దీనికింద యంత సొమ్ము తగలెట్టానూ!

మీనా—యెప్పుడుతోలేస్తారు?

రామ—యెప్పుడోనా? రేపే. లంజ యంత పతివ్రతవేషం వేసిందీ!

మీనా—మనవెఁప్పుడు వెళ్ళిపోవడం?

రామ—యక్కడికి?

మీనా—మతి పోతుందా యేవిఁటి? రాజమేంద్రం?

రామ—అవును. రేపు దాన్ని తోలేస్తానా? యెల్లుండి మనం వుడాయిద్దాం. గాని నీ సరుకులు తెచ్చుకుంటావా. ముసలాడికి వొదిలేస్తావా?

మీనా—నాకున్నదల్లా నాసరుకులే; యెలా వొదిలేస్తాను? నాసరకుల పెట్టెతాళం మానాన్న దగ్గిరుందిగదా యేవిఁగతి?

రామ—నా ప్రయోజకత్వం నీకేం తెలుసును? యిదుగో యీ రింగునవున్న యినప ములికీతో నీచిత్తవొఁచ్చిన పెట్టెతాళం తీసేస్తాను, గాని నాకంటె యక్కడుంది?

మీనా—గుంటకి పెట్టిందా? రాత్రివేళ. నాబట్టల పెట్లో పెట్టేది.

రామ—నీపుణ్యావుంటుంది. ఆ బట్టల పెట్టె వోమాటు తీసిచూతూ. రేపు దానికంటె మధురవాణికిచ్చి, ముండని తగిలేస్తాను.

మీనా—ఆగుంట బట్టల పెట్టె తాళం పారేశింది?

రామ—ములికితో తీసేస్తాను.

మీనా—నాసరుకుల పెట్టె తాళంకూడా తీసేసి పెడతారూ?

రామ—అద్దే!

మీనా—నన్ను పెళ్ళాడతానని ప్రెమాణం చేశారుకారే?

రామ—దీపం ఆర్పేస్తే పెట్టెతియ్యడం యలాగ?

మీనా—అగ్గిపుల్లవుంది.

రామ—ఐతే యిదిగో, నిన్ను తప్పకుండా పెళ్లాడతానని యీ దీపం ఆర్పేస్తున్నాను.

(రామప్పంతులు దీపం ఆర్పి మీనాక్షిని కౌగలించుకొని యెత్తును.)

రామ—యిలా యెత్తుకు తీసుకుపోతాను రాజమహేంద్రవరం.

(లుబ్ధావధాన్లు చీకటిలోవచ్చి కఱ్ఱతో రామప్పంతులు కాళ్లమీద కొట్టును. మీనాక్షి కిందపడును.)

లుబ్ధా—బందిపోటు గాడిదెకొడకా!

రామ—సచ్చాన్రా (వీధిలోకి కుంటుకుంటూ పోవును.)

లుబ్ధా—పో. ముండా నువుకూడా నాయింట్లోంచి (మీనాక్షిని పైకితోసి తలుపు గడియ వేయును)

రామ—అసిరిగా. చంపేశాఁడ్రా-కాలెవిఁక విరిగిపోయిందిరా.

అసి—(నిమ్మళంగా) దెయ్యాని కెట్టింది తింటె యేటౌతది బాబూ? (గట్టిగా) కానేళ యిల్లు జొరబడితే, బుగత తన్నడా?

రామ—(మీనాక్షితో) నువ్వు యింట్లోకి వెళ్ళిపో.

మీనా—మరి యింట్లో అడుగుపెట్టను. నా సరుకులు లేకపోతేపాయెను. రండి రాజమేంద్రం పోదాం.

రామ—తలిచినప్పుడేనా తాతకి పెళ్లి?

మీనా—మీయిష్ట వొచ్చినప్పుడు పెళ్లాడుదురుగాని, యింట్లోంచి లేవదీసుకొచ్చారు గదా? యిహా నేను మీతో వుండవలసినదాన్నే; పదండి.

రామ—వెఱ్ఱి కుదిరింది రోకలి తలకి చుట్టుకొమ్మన్నాట్ట! బతిమాలుకుంటాను యిప్పటికి యింట్లోకి వెళ్ళిపో.

మీనా—మరి యీజన్మంతో యీయింట్లో అడుగుపెట్టను.

రామ—అసిరిగా. మీనాక్షి వొక్కర్తా వుంటుంది. కాపాడి, బుగత తలుపుతియ్యగానే లోపలికి తీసికెళ్లు—(పరిగెత్తును. మీనాక్షి వెంటబడును.)

(రామప్పంతులు యింటియెదట)

రామ—(తలుపు తట్టి) వేగిరం, వేగిరంతియ్యి.

మధు—(తలుపు అవతలనించి) యేవిఁటా తొందర?

రామ—ఆకుచిట్టెడ వెంట తరువుతూంది.

మధు—చిట్టెడ కనపడగానే తలుపుతీస్తాను.

రామ—తలుపేసుకు, కూచుంటే నీక్కనపడ్డం యలాగ? నువ్వు తలుపు తీసేలోగా నన్ను కాజేస్తుంది.

మధు—నా కంటేదీ?

రామ—కంటె, కంటె, అని తపిస్తున్నావేవిఁటి? నిలబడ్డపాటున నూరు కంటెలు కురిపిస్తాను.

మధు—మీ నూరుకంటెలూ మీరు వుంచుకుని, నా వొక్కకంటె నాకిచ్చి, మరి యింట్లో అడుగుబెట్టండి.

రామ—రేపు పొగలుగాని కంటె యివ్వనన్నాడు లుబ్ధావధాన్లు?

మధు—రేపే యింట్లో కొత్తురుగాని. మించిపోయిందేవీ లేఁదు,

రామ—యింతట్లో చిట్టెడ మీదపడితే,

మధు—సకేశా? అకేశా?

రామ—పిల్లికి చలగాటం, యలక్కి ప్రాణపోకటా!

(మీనాక్షి ప్రవేశించి, రామప్పంతులు రెక్కపట్టుకొనును.)

మీనా—దీపం ఆర్పి ప్రమాణం చేశావు — తప్పితే తలపగిలిపోతుంది.

రామ—పోనుండా !

మీనా—మీ కాగల పెళ్ళాన్నిగదా యెక్కడికిపోతాను !

మధు—కాగల పెళ్ళావేఁవిటి ?

మీనా—నిన్ను వొదిలేసి, నన్ను రాజమహేంద్రం తీసుకుపోయి పెళ్ళాడతానన్నాడు దీపమార్పి ప్రమాణంచేశాడు — మరెలా తప్పుతాడు ?

మధు—యీవిడేనా ఆకునిట్టడ ?

రామ—ముండా, నాచెయ్యొదిలెయ్ — నిన్ను నే పెళ్ళాడతానన్నానే? కలగన్నావా యేవిఁటి ? (మీనాక్షిని విడిపించుకొనగా మీనాక్షి క్రిందపడును.)

మధు—ఆడదానిమీదా చెయ్యి జేసుకుంటారు? యేమి పౌరుషం! అబద్ధవాడక అన్నమాట నిలబెట్టుకోండి. యేం? కులం తక్కువా? రూపం తక్కువా? ఆమెబతుకు భ్రష్టు చెయ్యనే చేశారు; పెళ్ళాడి తప్పుదిద్దుకోండి — ఆవిణ్ణి పెళ్ళాడి వొస్తేనే నేను తలుపు తీస్తాను.

మీనా—పంతులు నన్ను కౌగలించుకుని యెత్తుకుంటే మానాన్న చూసి, తన్ని, యిద్దర్నీ యింట్లోంచి తగిలేశాడు. నువ్వు హెడ్డు కనిష్టిబుతో పోతున్నావు, నిన్నొదిలేసి నన్ను పెళ్ళాడతానని వొట్టేసుకున్నాడు. నన్ను లేవదీసుకొచ్చి నన్ను పెళ్ళాడక తప్పుతుందా యేమిటి ?

మధు—అవస్యం పెళ్ళాడవలిసిందే — పెళ్ళాడకపోతే నువ్వు మాత్రం వూరుకుంటావు? దావా తెస్తావు — పంతులుగారికి దావాలంటే సరదావే !

రామ—మధురవాణీ — నీకు పుణ్యంవుంటుంది — నా యింటికి నువ్వే యజమానివి ! తలుపు తియ్యి.

మధు—నిలబడండి. కర్పూరం వెలిగించి మంగళహారతి పళ్ళెం తెస్తాను. (తలుపు దగ్గిరనుంచి లోనికి వెళ్ళును.)

రామ—(తలుపు సందులోంచి చూసి, తరవాత మీనాక్షిని ముద్దెట్టుకుని) యెంత పని చేశావూ! దాంతో చెప్పేశావు! రహస్యంగా లేచిపోయి పెళ్ళిచేసుకోవాలి గాని, అల్లరి చేసుకుంటే యలాగ ?

మీనా—యెప్పుడైనా అందరికి తెలిసేదే గదా !

రామ—నామాటవిని యిప్పుడు యింటికి వెళ్ళిపో.

మీనా—యిహా మా యింటికి వెళ్ళను. యిదే మా యిల్లు; మధురవాణి తలుపు తీస్తుంది; లోపలికి వెళదాం.

రామ—అయితే యిక్కడవుండు యిప్పుడె వొస్తాను, (కొన్ని అడుగులు వీధింట నడచి నిలచి) నిజంగా మంగళహార్తి తెస్తుంది కాబోలు పెంకెలంజ ? అది

తలుపు తియ్యకపోతేనేం. రేపటికి నన్ను వెతకడానికి బయల్దేరుతుంది. తెల్ల వారవచ్చింది — చెరువువేపుపోయి కాలకృత్యాలు తీర్చుకుని ఆపైన చక్కా ఆలోచిద్దాం. రెండ్రోజులు పైకి పొడాయించామంటే మళ్ళీ వొచ్చేసరికి కొంత అల్లరి సద్దుకుంటుంది. తలుపు తీసినట్టు కానరాదు. యవడిల్లు? యవర్తె యిది నన్ను అడ్డడానికి? ఆశ్చర్యాం! (కొంత దూరంగా వీధిలో నిలబడి. దాసరి వేషంతో శిష్యుడు చిరతలుకొట్టి పాడును)

చరణం॥ "యిల్లుయిల్లని యేవు । యిల్లు నాదని యేవు ।
నీయిల్లు యెక్కడే చిలుకా!

రామ—యిది నాయిల్లు కాదా?

శిష్యుడు—"ఊరికి ఉత్తరాన । సమాధిపురములో । కట్టెయిల్లున్నదే చిలుకా॥"

రామ—వొల్లకాట్లోనా?

శిష్యుడు—పల్లవి॥ "యెన్నాళ్ళు బ్రతికినా । యేమి సామ్రాజ్యమే ।
కొన్నాళ్ళకోరాము చిలుకా?"॥

అనుపల్లవి॥ "మూణ్ణాళ్ళబతుకునకు । మురిసేవు బ్రతుకేవు ।
ముందుగతి కానవే చిలుకా"

రామ—యేమిటీ అపశకునం పాటా!

శిష్యుడు—"కట్టెతేచుట్టాలు । కట్టెకేబంధువులు ।
కన్నతల్లెవ్వరే చిలుకా?"

రామ—చుట్టాలా? వొక్క అప్పవుంది, అది యెప్పుడూ నా గుమ్మంలో అడుగుపెట్ట లేదు. యిప్పుడు యింటికి యజమాని యెవరూ? తలుపవతల సానిలంజాలు యివతల సంసారి వెధవలంజానూ; యిద్దరూ కలిసి యిల్లుచేరకుండా నన్ను తగుల్తున్నారు.

శిష్యుడు—"నిన్ను మోసేరు నలుగురు । వెంబడిని వకమంది!"

రామ—వెట్టి ముండాపాటా! పోదాం. (గబగబ కొంతదూరము నడచి, నిలుచుని) యీ తోవనే వొస్తున్నాడు కాబోలు — అడుగో పాట వినబడుతూంది?

పాట "నువ్వు కాలిపోయే దాక ।
కావలుంటురు గాని ।
పిదకు తొలగొత్తురు ।
వెంట నెవరూరాదు చిలుకా॥

రామ—వెట్టి ముండాపాటా!

శిష్యుడు—పంతులుగారూ! యక్కడున్నారు?

రామ—పరుగుచ్చుకోకపోతే పట్టుకుంటుంది. (పరిగెత్తును.)

శ్రీ

# కన్యాశుల్కము

# షష్ఠాంకము

## ౧-వ స్థలము రామచంద్రపురం అగ్రహారంలో

[చెఱువుగట్టున వున్న తోటలోనికి పెళ్ళివారి బళ్లువచ్చును, గట్టుమీద ఒకవైపు అగ్నిహోత్రావధాన్లు, రెండవవైపు పళ్ళుతోమికొనుచు రామప్పంతులు]

అగ్ని — బళ్ళుదింపండి. బళ్ళుదింపండి. సాయేబూ యేనుక్కి కావలిసినంత రొడ్డ చెఱువు స్నానానికి బహు బాగావుంది. యెవరయ్యా చెఱువుగట్టుమీద?

రామ — (తనలో) అరే! మరిచితిని, యీవేళే కదా పెళ్ళివారు రావలసిన రోజు? (పైకి) నా పేరు రామప్పంతులంటారు.

అగ్ని — లుబ్ధావధాన్లుగారు మిమ్మల్ని పంపించారా యేమిషి?

రామ — యెందుకండి?

అగ్ని — మేం వొస్తున్నామని యెదురుగా యెవర్నీ పంపలేదా? నా పేరు అగ్నిహోత్రావధాన్లు అంటారు.

రామ — మీరేనా అగ్నిహోత్రావధాన్లుగారు? యేం వచ్చారేవిటి?

అగ్ని — పెళ్ళిమాట మీకు తెలియదా యేముషి?

రామ — పెళ్ళెవరికండి?

అగ్ని — మీ దివానుకాదా యేమిషండి? మా పిల్లని లుబ్ధావధాన్లుగారికిస్తాం.

రామ — లుబ్ధావధాన్లుగారికి పెళ్ళైపోయిందే?

అగ్ని — తమరు హాస్యాలాడుతున్నారు — హాస్యాలకేం గాని, ప్రయత్నాలు యలా జరుగుతున్నాయి యేమిషండి?

రామ — మీరే హాస్యాలాడుతున్నట్టుంది, పెళ్ళి అయి పదిరోజులైంది. లుబ్ధావధాన్లుగారి సంబంధం అక్కర్లేదని మీరు రాశారట. అందుపైని యెవడో గుంటూరు నుంచి వచ్చిన ఓ శాస్తుల్లు కొమార్తెని పన్నెండు వొందలిచ్చి పెళ్ళాడారు.

అగ్ని — అన్నగారు — హాస్యం ఆడుతున్నారు. న్యాయంకాదు. మనకి బావగారివరసా యేమిషండి?

రామ— యేమిటి మీమాటలూ? నేను యెన్నడూ అబద్ధవాఁడి యెరగను. నామాట నమ్మకపోవడం ధర్మవేఁనా?

అగ్ని— ప్రమాణం చెయ్యగలండీ?

రామ— గాయత్రీ సాక్షి.

అగ్ని— అయ్యో! అయ్యో! యేవిఁ దురంతం! రండి. వెళ్ళి గాడిదకొడుకు యెవిఁకలు విరగ్గొడతాను.

రామ— నేను రానండి ఆ గుంటూరు సంబంధం చెయ్యవొద్దన్నానని నాతో మాట్లాడడం మానేశాడు. మీరు వెళ్ళిరండి-మీరు తిరిగీ వొచ్చిందాకా యిక్కడే కూచుంటాను.

అగ్ని— ఆ గాడిదెకొడుకు యింటికి నాకు తోవ తెలియదే?

శిష్యు— (చెరువుగట్టు యెక్కుతూ పాడును.)

“తానెవ్వరో తనవారెవ్వరో? । మాయజీవికి తనువుకు తగులాయగాకా”॥

(రామప్పంతులు నిలబడి భయము కనపర్చును.)

అగ్ని— యేవిఁ అలా చూస్తున్నారు?

రామ— శవాన్ని మోసుకుపోయే పాట!

శిష్యు— “దినమూ, మరణమని తెలియూడీ”

రామ— (శిష్యునితో) వూరుకో (అగ్నిహోత్రావధాన్లుతో) అన్నా ఒకానీ వుందా?

శిష్యు— మిమ్మల్ని తీసుకురమ్మంది.

రామ— చెప్పనే—వొస్తాంగానీ యేవిఁటి?

శిష్యు— కంటెపోతేపోయింది, రమ్మంది.

రామ— బతికాను.

అగ్ని— చావడం యెందుకు, బతకడం యెందుకు?

రామ— అది వేరేకథ.

శిష్యు— చిట్టిపులి పిల్లని తండ్రొచ్చి వండకి తీసుకుపోయినాడట.

అగ్ని— యీవూళ్లోకి ఫుల్లొస్తాయా యేమిషి?

రామ— విరగడైపోయింది. (శిష్యునితో) యింద రూపాయి (శిష్యుడు తీసుకుని) దాసుణ్ణి బాబా!

(పాడును) “చిత్తాస్వాతివాన, జోడించికురియగ”

అగ్ని— యేవిఁటీ వెధవపాట? ఫూదుకుంటావా వూరుకోవా? నీకు రూపాయి చాలదురా గుంటకక్కగట్టా?

శిష్యు—తమరు దయచెయ్యిస్తారా బాబూ?
అగ్ని—నేనివ్వను - అన్నాను, తోవ యవరు చూపిస్తారు?
రామ—(శిష్యుడితో) నీకు ఉద్ధావధాన్లు యిల్లు తెలుసునా?
శిష్యు—తెలుసును - తండ్రీ.
రామ—అవధాన్లుగారు ఓ కానిడబ్బిస్తారు. యిల్లు చూపించు.
శిష్యు—ముందిస్తేగాని చూపించను.
అగ్ని—యిందా - యేడువు.

(శిష్యుడు ముందూ అగ్నిహోత్రావధాన్లు వెనకా కొన్ని అడుగులు వెళ్ళిన తరవాత, శిష్యుడుపాడును.)

శిష్యు—"నీలాలకా యేల నీయలుకా?"
అగ్ని—యలకేవిఁటి నీశ్రాద్ధం?
శిష్యు—యలకాకాదు, పిల్లి.
(పాడును) "పిల్లన్న తెయి తక్కలాడంగనూ। యలకతేరూగట్టి దున్నంగనూ"
అగ్ని—యేవిఁటీ?
శిష్యు—"మేకపిల్లరెండు మేళాంగట్టుకుని। మేరంగిసీథాణాని తెల్లంగనూ"॥
అగ్ని—యేవిఁటి నీశ్రాద్ధంపాట!
శిష్యు—"తొండాయి నేస్తూడు, దొనిగట్టిఁబట్టుకుని। తోటమల్లి పువ్వుతేరంగను!!
అగ్ని—పాడావంటే తంతాను,
శిష్యు—అయితే నీకు మరి యిల్లు చూపించను.
అగ్ని—పాడగట్టా - (కొట్టబోవును.)
శిష్యు—(తప్పించుకుపోతూ) "గట్టుకింబానున్న। పండాయనేస్తూడు మరిగబుకూ। మరిగుబుకూ॥"

(నిష్క్రమింతురు)

అగ్ని—వీడిశ్రాద్ధం పెట్టుకింద పెట్టా - తోవచూపుటా? అటా?

(తెర దించవలెను)

## 2-వ స్థలము : చెఱువుగట్టుతోట.

[అగ్నిహోత్రావధాన్లు, రామప్పంతులు, వెంకమ్మ, యితరులూ]

అగ్ని—గాడిదెకొడుకుని మాచెడ్డదెబ్బలు కొట్టేశాను; యేనుగులూ గుఱ్ఱాలూ తెచ్చాను వీడిశ్రాద్ధం మీదికి! తోవఖర్చయినా వొకదమ్మిడీ ఇయ్యడష.
వెంకమ్మ—మన ప్రారబ్ధం-నే నొచ్చినవోపులు యిలా పుంటగా, మరోలా యెలా అవుతుంది? యీసంమంధం వొద్దని పోరితే వినాన్నారా? నేను భయపడు తూనే వున్నాను. బయల్దేరేటప్పుడు పిల్లి యెదురుగుండా వొచ్చింది.

అగ్ని — పింజాంకి! వ్యాపారకోటి—ఆ సంగతులు నాకేం తెలుసును? అన్నగారూ, క్రిమినల్ కేసు తావడానికి అవకాశం వుంటుందా? మావద్దిర అయ్యవార్లు ఒకాయన వున్నారు. ఆయన కిలాడీగట్రామాబాగా తెలుసును. ఆయన్నికూడా సలహా చేదాం.

రామ — కోర్టువ్యవహారాల్లో ఆరితీరిన మీకు ఒకరు సలహా యివ్వాలండీ? స్వంతజ్ఞానం గనక సాక్ష్యం సిద్ధం చేవడానికి నేను సాయం చేస్తానన్నాను గాని. అయ్యవార్లూ సిద్ధాంతుల్లూ మీకూ నాకూ సలహా చెప్పేపాటివాళ్ళా? గుంటకక్కిరితట్లు రెండు యింగిలీషుముక్కలు చదువుకున్నారు గనక ముక్కస్యను శార్థ్యర్థ అని తర్జుమాలమట్టుకు చేస్తారు; గాని యేదయినా యెత్తుయెత్తావంటే తమలాంటి యోధులు యెత్తాలి. నాలాంటి నియోగపాడు నడిపించాలి. క్రిమినలుకి అవకాశంవుందా అని అడుగుతారేమిటి? మీకు తెలియదా యేమిటి! — పట్టుపైని సులభసాధ్యంగా మూడు నాలుగువేలు డామేజీకూడా సివిల్లో లాగేస్తారు.

అగ్ని — అదే నా ఆలోచన.

రామ — తీరిపోయింది; మళ్ళీ యిహ సలహా కేవుంది. వెంటనే వెళ్ళి ముక్క తగిలించేదాం. ఖర్చులికి సొమ్ముపట్టుకుని బయలుదేరండి.

అగ్ని — నాదగ్గిర దమ్మిడీ లేదు; యేమి సాధనం? యీ గాడిదకొడుకు రూపాయలిస్తాడని నమ్మి, నే నేమీ తేలేదు.

రామ — యింటికి వెళ్ళి తెచ్చుకునేటప్పటికి పుణ్యకాలం మించిపోతుంది. "శుభస్య శీఘ్రం" అన్నాడు — మీ ఆలోచనేమిటి?

అగ్ని — యిదేదో అయితేనే గాని యింటిమొహం చూసేదిలేదు. మా అమ్మినరుకేదయినా యీ వూళ్ళో తాకట్టు పెడదాం.

రామ — అయితే పట్టుకురండి; పోలిశెట్టి దగ్గిర తాకట్టు పెడదాం; పోలిశెట్టిని మనం కొంచం మంచి చేసుకోవడం అవశ్యకం. మీరు లుబ్ధావధాన్లుని కొట్టినప్పుడు — పోలిశెట్టి వున్నాడు గనక, లుబ్ధావధాన్లు మీమీద ఛార్జిచేసినప్పుడు, పోలిశెట్టి తప్పకుండా సాక్ష్యం వేస్తాడు. శెట్టిని మనం విడతియ్యడం జరూరు — యేమంటారు?

అగ్ని — మీ సలహా మా బాగావుంది. నాకూ అదే భయమేస్తూంది.

రామ — చూశారా, ప్రతివాడికీ సలహా చెప్పడం చాతౌతుందండీ? అందులో యీ యింగిలీషు చదువుకున్న అయ్యవార్లని సలహా అడిగితే, కేసులే తేవొద్దంటారు. దొంగసాక్ష్యాలు తేవొద్దంటారు. వాళ్ళసొమ్మేం పోయింది? దేమ మాత్రక్కూడా లేకపోతే కేసులు గెలవడం యెలాగ?

అగ్ని — మా అయ్యవార్లు మట్టుకు మంచి బుద్ధిమంతుడూ, తెలివైనవాడూ నండి — కోర్టు వ్యవహారాలల్లో ఆయనకి తెలియని సంగతి లేదండి. అంత బుద్ధిమంతుణ్ణి నేను యక్కడా చూడలేదు, ఆయన్ని చూస్తే మీరూ అలాగే అంటారు.

రామ — యెంత బుద్ధిమంతుడైనా మీకొవాడు సలహా చెప్పేవాడున్నాడండి? చెవులో మాటోమాట — మీ అయ్యవారు గిరీశంగారు కారండీ? వాడు లుబ్ధావధాన్లు పింతల్లికొడుకుగదా? మీకా వాడు, యీ కేసుల్లో సరైన సంగతి చెబుతాడు?

అగ్ని — అవునండోయి!

రాము — నియ్యోగపాణ్ణి - నామాట కొంచెం ఖాతరీ చెయ్యండి. గనక, ఆ అయ్యవార్ని తోడిచ్చి, పిల్లల్ని యింటికి పంపించెయ్యండి. యెకాయెకిని మనం తక్షణం వెళ్ళిపోయి, లుబ్ధావధాన్లుకన్న ముందు ముక్క తగిలించెయ్యాలి. యేదో ఒసరుకు వేగిరం పట్టుకురండి.

అగ్ని — యేదీ, అమ్మిని యిలా పిలువు.

వెంకమ్మ — అమ్మేది చెప్మా? బద్దకించి బండిలో పడుకుంది కాబోలు. పిలువమ్మా.

అగ్ని — మనకి డామేజీ దిట్టంగా వొస్తుందా?

రాము — వొస్తుందంటే, అలాగ యిలాగానా?

ఒకడు — అమ్మన్నగారి బండి యక్కడా కనపడదు; బండీ వెనక పడిపోయింది కాబోలు.

వెంకమ్మ — అదుగో అబ్బివస్తున్నాడే? వీడెలా వొచ్చాడు? అబ్బి నువ్వు అక్కయ్య బండిలో కూచోలేదూరా?

వెంకశే — లేదు. నేను యేమనెక్కాను.

అగ్ని — దొంగగాడిదకొడకా అయ్యవారేరా?

వెంకశే — యెక్కడా కనపడ్డు.

అగ్ని — గుఱ్ఱం వొచ్చిందా? గుఱ్ఱపాడేడీ?

వెంకశే — గుఱ్ఱపాడు చెప్పాడు—

అగ్ని — యేమిట్రా, వెధవా, చెప్పాడూ?

వెంకశే — మాస్టరూ — రాత్రి —

అగ్ని — నోటంట మాట పెగల్దేం?

వెంకశే — గుఱ్ఱందిగి — బండి యెక్కాట్ట.

వెంకమ్మ — అయ్యో దాన్ని లేవదీసుకు పోలేదుగద?

దగ్గిరనున్నవారు — ఆఁ! ఆఁ!

వెంకమ్మ — కొంప మునిగిపోయింది. మరేవిఁటి!

(చతికిలబడును)

అగ్ని — (కోపముచేత వణుకుచు) అయ్యవారు పకీరుముండని లేవతీసుకు పోయాడూ? నగలు పెట్టె? నా కోర్టుకాగితాలో!

వెంకటేశం — అక్కయ్య పెట్లో నా పుస్తకాలు కూడా పెట్టాను.

అగ్ని — దొంగగాడిదె కొడకా! నువ్వే వాణ్ణి యింట్లో పెట్టావు. యింత అచోకీ తెలిసింది కాదు. దొంగవెధవని చంపేసిపోదును. గాడిదెకొడుకును అమాంతంగా పాతిపెట్టేదను.

రామ — (దగ్గిరకువచ్చి) అయ్యవారు మహా దొడ్డవారని చెప్పారే? యేమి యెత్తుకుపోయినాడేమిటండి?

అగ్ని — యేవిఁ యెత్తుకుపోయినాడా? నీ శ్రార్ధం యెత్తుకుపోయినాడు. పకీరుముండని యెత్తుకు పోయినాడు. యీ గాడిదెకొడుకు యింగిలీషు చదువు కొంప ముంచింది. (వెంకటేశం జుత్తుపట్టుకుని కొట్టబోవుచుండగా తెరదించవలెను.)

## 3-వ స్థలము : విశాఖపట్టణములో మధురవాణి బస యెదటివీధి.

[రామప్పంతులు, అగ్నిహోత్రావధాన్లు, ప్రవేశింతురు]

అగ్ని — మనం పోలిశెట్టిదగ్గిర బెదుళ్తెచ్చిన రూపాయిలన్నీ అయిపోయినాయి; యిప్పటికీ ఖర్చులు ఖర్చులే అంచారు; నాదగ్గిర వకదమ్మిడీలేదు.

రామ — ఖర్చుకానిది కార్యాలవుతాయిటయ్యా? మీ కడియం యెక్కడైనా తాకట్టు పెట్టండి.

అగ్ని — యీవూళ్లో మనం యెరిగినవాళ్ళెవరున్నారు?

రామ — మధురవాణి దగ్గిర తాకట్టుపెడదాం.

అగ్ని — చేసేవి మాఘస్నానాలూ, దూరేవి దొమ్మరి కొంపలూ అని అటూంత స్వాధ్యాయిని నన్ను ముండలిళ్ళకి తీసుకువెళతావటయ్యా?

రామ — మరి యేకొంపలూ తిరక్కపోతే కేసులు గెలవడం యలాగ? అది అందరు ముండల్లాంటిదీ అనుకున్నారా యేమిటి? సంసారివంటిది. ఐనా మీకు రావడం ఇష్టంలేకపోతే నాచేతికివ్వండి, నేనే తాకట్టుపెట్టి సొమ్ము తీసుకొస్తాను.

అగ్ని — అలాక్కాదు; నేనుకూడావస్తాను

రామ — యేదీ కడియం ఇలాగివ్వండి.

అగ్ని — యిది మాతాతగారిచ్చాటిది. యిది యివ్వడమంటే నాకేమీ యిష్టంలేకుండా వుంది. డబ్బు వూరికే ఖర్చుపెట్టించేస్తున్నారు; మీరు కుదిర్చినవకీలు తగినవాడు కాడప; యింగ్లీషూ రాదు ఏమిలేదూ.

రామ——అయిన్లాంటిచెయ్యి యీ జిల్లాలో లేదు. అయిన్ని మాస్తే డిస్ట్రిక్టుకలెక్టరుగారికీ ప్రాణం. ఇంతకీ మీ రేదో పట్టుదల మనస్సులో అనుకున్నారు గాని, మొదటున్న వుత్సాహమ్మీకు యిప్పుడు లేదు. మీకు డబ్బు ఖర్చుపెట్టడం యిష్టంలేకపోతే మానేసాయెను. "యావత్తైలం, తావద్వ్యాఖ్యానం" అన్నాడు, మరి నాకు శెలవిప్పించెయ్యండి.

అగ్ని——(ఆలోచించి) అయితే తాకట్టుపెట్టండి. (అని నిష్కారముగా కడియము తీసి యిచ్చును.)

రామ——(తనచేత నెక్కించును) ఈ కేసుల్లో యిలాగు శ్రమపడుతున్నాను కదా? నాకోక దమ్మిడీ అయినా యిస్తారు కాదుగదా!

అగ్ని——అయితే నాకు జయం పుడాయిస్తావా యేమిటి ?

రామ——నేను మీకు యెలాంటి వకీల్ని కుదిర్చాను! ఆయన మీ విషయమై యెంత శ్రమపడుతున్నాడు! ఇదుగో ఆయన వస్తున్నాడు.

[నాయుడు ప్రవేశించును]

రామ——(తనలో) యేమిటి చెప్మా వీడు మధురవాణి ఇంటి పెరటి గడ్డివేపునుంచి వస్తున్నాడు? వీడు కూడా మధురవాణికి మరిగాడా? యేమిటి? వీణ్ణి యీ కేసులోనుంచి తప్పించెయ్యాలి.

నాయుడు——యేమండీ రామప్పంతులన్నా, మీరు తాఖీదు యిప్పించారు కాదుగదా ?

అగ్ని——మీరు రాసిన డిఫెన్సు బాగుండి కాదని యుక్తిగా అన్నారట.

నాయుడు——ఎవడా అన్నవాడు ? గుడ్లు పీకించేస్తాను. రామప్పంతులన్నగారూ చూశారండీ — డిఫెన్సు యెంత జాగ్రతగా తయారు చేశానో, నాదగ్గిర హైకోటు జాక్టు డ్రాఫ్టు ప్లయింట్లు రాసుకుని వెళ్లిపోతారు యీ తుచ్ఛకేసనగా యేపాటి! నేచెప్పినట్టల్లా పార్టీనిస్తే నేపట్టిన కేసు పోవడమున్నూమాట యెన్నడూ లేదు. యీ డిఫెన్సు చిత్తగించండి, (చంకలోని రుమాలు కట్టవిప్పి అందులో ఒక కాగితముతీసి చదువును.)

"ఫిర్యాది చెప్పిన సంగతులు యావత్తూ అబద్ధం కాని యెంత మాత్రం నిజం కావు" చూశారా ఆ వాక్యం మాటతోటే ఫిర్యాదీవాదం అంతా పడిపోతూంది "ఫిర్యాదీ నామీదగిట్టక దురుద్దేశంతో కూహాకంచేసి కేసు తెచ్చినాడు కాని యిందులో యెంతమాత్రం నిజంలేదు."

రామ——డిఫెన్సుమాటకేమండిగాని అవధాన్లుగారు పైసా లేదంటున్నారు,

నాయుడు——పైసా లేకపోతే పనెలా జరుగుతుంది ?

రామ——ఒకసంగతి మనవిచేస్తాను యిలారండి. (రామప్పంతులు, నాయుడు వేరుగా మాటలాడుదురు.)

నాయుడుగారూ మీ వకాల్తీ యిచ్చిన కేసు సమాధానంలేదు. నే నెంత చెప్పినా వినక భీమారావుపంతులుగారికి వకాల్తీయిచ్చాడు. మీకు యింగ్లిష్ రాదనీ, లా రాదనీ, యెవడో దుర్బోధచేశాడు.

నాయుడు—స్మాలెట్ దొరగార్ని మెప్పించిన ముండాకొడుకుని నాకు లా రాక పోతే యీగుంటవెధవకుటోయ్ లావస్తుంది, పాస్‌పీసని రెండు యింగ్లీషు ముక్కలు మాట్లాడడంతో శేపరా యేమిటి? అందులో మనడిస్ట్రిక్టుకలక్టరుగారికి యింగ్లీషు వకీలంటే కోపం. అందులో బ్రాహ్మణ్ణంటే మరీని. ఆమాట అలిం దరికి బోధపర్చండి.

రామ—మరి కార్యంలేదండి. నే నెంతో దూరం చెప్పాను; తిక్కముండాకొడుకు విన్నాడు కాదు.

నాయుడు—అయితే సర్విలాగు అమల్జాద చేస్తారూ? యీ బ్రాహ్మడియోగ్యత యిప్పుడే కలక్టరుగారి బసకు వెళ్ళి మనవి చేస్తాను.

(తెరదించవలెను.)

## ౭-వ స్థలము : లుబ్ధావధాన్లుబస

లుబ్ధావధాన్లు—(ప్రవేశించి) ఏమి దురవస్థ వచ్చిందీ! నా అంత దురదృష్టవంతుడు లోకంలో యెవడూలేడు, యేల్నాటి శనిరాగానే కాశీకి బయల్దేరి పోవలసింది బుద్ధి తక్కువపని చేశాను, యిలా రాసిపుండగా యెలాతప్పుతుంది. సౌజన్యారావు పంతులు దేవుఁడు ఆయనలాంటివాళ్ళు వుండబట్టే వర్షాలు కురుస్తున్నాయి. ఆయన శలవిచ్చినట్టు తప్పంతా నా యందు వుంచుకుని విధిని నిందించడ మెందుకు? ఇంత డబ్బుండీన్నీ, డబ్బుకి లోభపడి ఒక్కగా నొక్క కూతుర్ని ముసలివాడికి అమ్మాను, నా జీవానికి ఉసురుపోసుకుంటూ అది కానితిరుగులు తిరిగిందంటే దాని తప్పా? బుద్ధితక్కువ వెధవని, ముసలితనంలో నాకు పెళ్ళేం? దొంగముండా కొడుకని తెలిసిన్నీ ఆ రామప్పంతుల్ని నే నమ్మడమేవిఁ? ఆ మాయగుంట పారిపోవడ మేవిఁ? కంటెకి, ఆ అల్లరేమి? ఆ యినస్పికటరు ఖూనీ చేశావని మమ్మల్ని సలపెట్టడ మేవిఁటి? అంతా ఘోరకలి; కలి నిండి పోతూంది. ఒక్క సౌజన్యారావు పంతులు సత్యసంధుడు నాకు కనపడు తున్నాడు. కశవంతా వకీళ్ళూ, పోలీసులూ, వచ్చిపడ్డొంగలు— ఆయన చక్రం అడ్డువేసి మమ్మల్ని యీ ఆపదలోంచి తప్పించారంటే కాసీవాసం పోతాం.—యేమి చిత్రాలు! వెధవలకి మఠం కట్టారట! యెన్నడూ విన లేదు. అమ్మిని తీసికెళ్ళి ఆ మఠం చూడమంటాను. దానికి యిష్టం కలిగిందా, దానికి కావలిసిన డబ్బు యిస్తాను. ఆ మఠంలో వుంటుంది. లేకుంటే నాతో పాటు కాసీవాసం

[రామప్పంతులు ప్రవేశించును.]

లుబ్ధా—కంఠె, గింఠె అని నాతో మీరు ప్రశంసించవలసిన కార్యంలేదు.

రామ—ఆ కంఠెమాట ప్రశంసించడానికి రాలేదు మావాఁ. ఆ కంఠె మధురవాణిది. మీరెరగరా? అదీ, మీరూ యేం జేసుకుంటారో నాకేంకావాలి? కంఠె సిగతో సిరిగాని. మీకు ఓగొప్ప సాయం చెయ్యడానికి వొచ్చాను మీ అవస్థ చూస్తే నాగుండె నీరై పోతూంది.

లుబ్ధా—మహాప్రభో! నీకు పదివేల నమస్కారాలు. యిక యీ పకీరు వెధవని వదిలెయ్యి.

"రామనామ తారకం।
భక్తిముక్తిదాయకం॥ జానకీమ"

రామ—రామ! రామ! యంతమాట అంటివయ్యా! మీరు ఆపదలో వుండి విరక్తిచేత యేమి మాటలన్నా అవి పడి, పనిచెయ్యడం నాకు నీతి. చెప్పే మాట చెవిని బెట్టండి, ఇందూ వెనకా చూడడానికి యిహ టైము లేదు! వ్యవహారం అంతా సూక్ష్మంగా పొక్కు పసుచుకు వొచ్చాను. రెండు సంచులతో కూనీకేసంతా మంచు విడిపోయినట్టు విడిపోతుంది. ఒక్క యినస్పెక్టరుతో కుదరలేదు. డిస్ట్రిక్టుకలక్టరికి కూడా చెయ్యి తడిచెయ్యాలి—మీ దగ్గిర యిప్పుడు సొమ్ము లేదంటిరా, ఒకచోట వ్యవహారం కూడా పొక్కు పరచ్చాను. ప్రాంసరీ నోటుమీద యెన్ని రూపాయలు కావలిస్తే అన్ని రూపాయలిస్తారు.

లుబ్ధా—నేను ఒక దమ్మిడీ యివ్వను. "రామనామతారకం భక్తిముక్తిదాయకంతి జానకీ మనోహారం! సర్వలోకనాయకం"॥

రామ—నామాటవిను. యంతో ప్రయాసం మీద యీఘట్టం కుదిర్చాను. తాసిల్దారు మీదగ్గిర లంచం పుచ్చుకుని కూనీకేసు కామాపు చేశాడని యినస్పెకటరు డిస్ట్రిక్టుకలక్టరికి గట్టిగా బోధపర్చాడు. కలక్టరు సలహామీద యినస్పెక్టరు చాలా పట్టుదలగా పనిచేసి, సాక్ష్యం అంతా రడీ చేశాడు. కేసు రుజువైనట్టాయనా యేమౌతుందో ఆలోచించుకోండి.

లుబ్ధా—నీకెందుకు నాయేడుపు?

రామ—డిస్ట్రిక్టుకలక్టరు బ్రహ్మద్వేషి – తాసిల్దారు తాడు ముందుతెగుతుంది. తరవాత మిమ్మల్నీ, మీనాతీనీ కమ్మెంటు కట్టేస్తాడు – వురిసిద్ధం. నాకూ యినస్పెక్టరికీ వుండే స్నేహంచేత యీ ఘట్టానికి వొప్పించాను,గనక నామాటకి చెవొగ్గి యీ ఆపద తప్పించుకోండి.

లుబ్ధా—నన్ను బాధపెట్టక నీమానాన్న నువ్వుపోదూ, "రామనామతారకం! భక్తిముక్తిదాయకం॥"

రామ — నీ అంత కర్కోటకుణ్ణి యెక్కడా నేను చూడలేదు. నీ మాటకేం పెద్ద వాడివి—పసిపిల్ల, కడుపునకన్న మనాతికి వురిసిద్ధం అయితే, ముండా డబ్బుకి ముందూ వెనకా చూస్తావు! తలుచుకుంటే నాహృదయం కరిగిపోతూంది.

[సౌజన్యారావుపంతులు ప్రవేశించును]

రామ — తమరు ధర్మస్వరూపులు. లుబ్ధావధాన్లుగారియందు అకారణమైన దయచేత యీ కేసులో పనిచేస్తున్నారు. కేసంతా వట్టి అన్యాయమండి ఒక్కపిసరైనా నిజంలేదు. శలవైతే గట్టి డిఫెన్సుసాక్ష్యం—

సౌజ — నీ సంగతి నాకు తెలుసును. అవతలికి నడువు.

రామ — తమరు యోగ్యులూ, గొప్పవారూ అయినా, ఏకవచనప్రయోగం.—

సౌజ — నడువు!

(రామప్పంతులు నిష్క్రమించును)

సౌజ — ఈదౌర్భాగ్యుణ్ణి తిరిగీ యెందుకు రానిచ్చారూ?

లుబ్ధా — పొమ్మంటే పోడు బాబూ.

సౌజ — యేవొచ్చాడు?

లుబ్ధా — యినస్పెక్టరికీ డిప్టీకలకటరికీ లంచం యిమ్మంటాడు.

సౌజ — డిప్టీ కలకటరుగారు లంచం పుచ్చుకోరు, ఆయన నాకు స్నేహితులు: నాకు తెలుసును. లంచాలూ పంచాలూ మీరు యిచ్చినట్టయితే, మీ కేసులో నేను పని చెయ్యను.

లుబ్ధా — తమశలవు తప్పి నడుస్తే చెప్పుచ్చుకు కొట్టండి. నాకు భగవంతుడి లాగా తమరు దొరికారు — "పాలముంచినా మీరే, నీళ్ళను ముంచినా మీరే" అని మిమ్మల్నే నమ్మి ఉన్నాను.

సౌజ — మీరు నేరం చేయలేదని నాకు పూర్తిఅయిన నమ్మకం వుంది. నిజం కనుక్కోడానికి చాలాప్రయత్నం చేస్తున్నానుగాని అగుంటూరి శాస్త్రుల్లు యవడో భేదించ లేకుండా వున్నాను. మీరు జ్ఞాపకం మీద చెప్పినచవహారా గుంటూరు వ్రాసి పంపించాను. అక్కడ అలాటిమనిషి యవడూ లేడని జవాబు వొచ్చింది.

లుబ్ధా — అదేంమాయో బాబూ! మీ సాయంవల్ల యీగండంగడిచి, నాపిల్లా నేనూ యీ ఆపదలోంచి తేలితే, నా డబ్బంతా, మీపాదాలదగ్గిర దాఖలుచేసి కాసీ పోతాను.

సౌజ — మీ డబ్బు నాకక్కరలేదని మీతో మునుపే చెప్పాను. నే చెప్పిన మాటలు మీకునచ్చి, ముసలివాళ్ళు పెళ్ళాడకూడదనీ, కన్యాశుల్కం తప్పనీ, యిప్పటికైనా మీకు నమ్మకం కలిగితే, యిలాంటి దురాచారాలు మాన్పడానికి రాజమహేంద్రవరంలో వక సభవుంది, ఆ సభకి కొంచవో గొప్పో మీకు తోచిన డబ్బుయివ్వండి. వితంతువుల మఠానికి మీపిల్లని పంపడం నాసలహా.

లుబ్ధా—తమచిత్తం, తమకళలవు చేసిన తప్పులు, తప్పులని కళ్యాల్ని పట్టిపోయింది. బుద్ధివొచ్చింది బాబూ.

సౌజ—అగుంటూరు శాస్త్రుల్లుకి పరవంటదేశపు యాసవుండేదా? బాగా జ్ఞాపకం చేసుకు చెప్పండీ.

లుబ్ధా—(ఆలోచించి) లేదండి.

సౌజ—బాగా జ్ఞాపకం తెచ్చుకోండి.

లుబ్ధా—లేదండి.

(తెరదించవలెను)

## ౫-వ స్థలము విశాఖపట్టణంలో.

[మధురవాణి యింటి యెదటవీధికొనను కరటకశాస్త్రి, శిష్యుడూ ప్రవేశింతురు.]

కరట—నువ్వు ఆ కంటె వాళ్ళనెత్తిని కొట్టకుండా లేచిరావడం నుంచి, యీ ముప్పంతా వొచ్చినట్టు కనపడుతుంది.

శిష్యు—మధురవాణి కంటె మధురవాణికి యివ్వడం తప్పాఅండి?

కరట—తప్పుకాదా? నువ్వు యిచ్చావని, మరి అది వొప్పుకుందా? "తే, ధగిడీకే కంటె తెస్తావా, చస్తావా!" అని రామప్పంతుల్ని పీకి పిండెట్టింది. కాని బాధపడలేక ఆరామప్పంతులు కూనీ కేసని రొయ్యెత్తు యెత్తాడు. ఆముసలాడికి సిఖ అయిపోయిందంటే, బ్రహ్మహత్య నా మెడకి చుట్టుకుంటుంది. నువ్వు అంటూ ఆకంటె వాళ్ళయింట వొదిలేస్తే నాకు యీ చిక్కు లేకపోవుగదా?

శిష్యు—వెధవముండ గూబగదలేస్తూంటే కంటె గింటె యెవడికి జ్ఞాపకం వొస్తుందండి? చయికరిచ, పెట్టెతీసి, మొహురు అంకించుకుని చెంగున గోడ గెంతాను పట్నంవొండువొండలు మీరుపట్టూగా, నాకు పెళ్ళిలో పెట్టినకంటె నేను తెచ్చానని నా తప్పు కట్టుతున్నారు? ఆకంటె అయినా దక్కిందా? చూస్తూనే మధురవాణి లాక్కుంది.

కరట—నేను హాస్యగాణ్ణైగాని, యీ కూనీ గడబిడతో నాహాస్యం అంతా అణిగిపోయింది. గనక యిక హాస్యంమాను—నేను తీసుకున్న రూపాయలు లుబ్ధావధాన్లకి యెప్పటికైనా పంపించడానికే తలచాను! అంతే గాని అపహరిద్దామని అనుకోలేదు—మధురవాణిని యెలాగైనా అయ్యలేసి, కంటె యెరువుపుచ్చుకుని ఆకంటా, యీ రూపాయలూ, బంగీకట్టి అవుధాన్లుకి పంపించేస్తే, కూనీ నిజం కాదని పోల్చుకుంటారు. నాకు యీ బ్రహ్మహత్య తప్పిపోతుంది.

శిష్యు—మీనాన్నలు సౌజన్యారావు పంతులుగారితో నిజం చెప్పేయ్యరాదా అండీ?

కరట — వెఱ్ఱి కుదిరింది, రోకలి తలకి చుట్టమన్నాట్ట! వెనకటికి యెవరో పోలీసు, తల్లి కూరగాయలు పుచ్చుకుంటే, జుల్మానా వేశాట్ట; సౌజన్యారావుపంతులు అలాంటివాఁడు. ఆయనతో మనం పుస్తమాట చెప్పావంటే, ఆయన నిజం కోర్టులో చెప్పేస్తాను అన్నాఁడని లుబ్ధావధాన్లు పీకపురి, మన పీకకి తగులు కుంటుంది.

శిష్యు — "మన" అంటున్నా రేవిఁటి?

కరట — మాట పొరపాటున్నా. రామప్పంతులు వూరికి వెళ్ళినమాట నిజవేఁనా?

శిష్యు — నిజవేఁ.

కరట — వాఁడికంట పడ్డావఁంటే—

శిష్యు — పడితే?

కరట — మరేం లేదు. మధురవాణి గాని కంటపడి మనకి యెరువు యివ్వడానికి వొప్పు కుంటే ఆంజనేయస్వామికి పదిశేర్లు నెయ్యి దీపారాధన చేస్తాను.

శిష్యు — కడుపులోకి వెళ్ళవలసిన నెయ్యి కాల్చెయ్యడం నా కేవీఁ యిష్టంలేదు అమృతగుండీ మొక్కుకోండి.

కరట — హాస్యం చాలించు, తెలిసిగోడుతుంది.

(నిష్క్రమింతురు.)

## ౬-వ స్థలము : మధురవాణి బసలోగది.

[మధురవాణి కుర్చీమీద కూచునియుండును. కరటకశాస్త్రుల్లు, శిష్యుఁడూ, ప్రవేశింతురు మధురవాణి నిలబడును.]

మధు — గురువుగారికి పదివేలదండాలు; శిష్యుడికొక చిన్నముద్దు (శిష్యుని ముద్దు బెట్టుకొనును.)

కరట — నీ పుణ్యం వుంటుంది. నా అల్లుణ్ణి చెరగొట్టకు.

మధు — అల్లుడెవరు?

కరట — మా పిల్లని యీనగాఁడికి యిచ్చి, కన్యాదానం చేస్తాను.

మధు — జెయిలునుంచి వొచ్చినతరవాత పెళ్లా! లేక పెళ్ళిచేసుకుని, మరీ మఠ ప్రవేశవాఁ?

శిష్యు — జయిలేవిఁటండోయి?

కరట — వొట్టినే హాస్యానికంటూంది.

మధు — పాపం ఆపసిపిల్లవాఁడికి వున్న నిజస్థితి చెప్పండి. తనవాళ్ళని వెళ్ళిచూసైనా వస్తాడు.

శిష్యు — (కరటకశాస్త్రితో) కొంపముంచారో?

మధు — ముంచడం అంటే అలాగా యిలాగానా?

కరట—నీపుణ్యం వుంటుంది. హాస్యం చాలించు లేకపోతే మస్తువాళ్ళకి పెద్దలయందు భక్తి చెడుతుంది.

శిష్యు—నేనేం తప్పుచేశాను? గురువుగారు చెప్పినపనిచేశాను. ఆతప్పూ వొప్పూ ఆయనదే.

మధు—యెవరేమిచేసితిరో, నాకు తెలియదుగాని, మీయిద్దరికోసం హెడ్ కనిష్టీబు గాలిస్తున్నాడు. దొరకగానే మఠంప్రవేశం చేస్తాడట యీ మాటమట్టుకు నాకు రూఢిగా తెలుసును.

శిష్యు—యిదేనా మీరు నాకు చేస్తానన్న పెళ్ళి?

కరట—యేమైనా జట్టీవస్తే, నీ ప్రాణానికి నాప్రాణం అడ్డువెయ్యనట్రా?

మధు—వొస్తే జట్టీ గురుశిష్యులకు యిద్దరికీ వొక్కమారే వస్తుందిగాని ఒకరికి రావడం ఒకరు అడ్డుపడడం అన్నమాట వుండబోదు. యెప్పుడైనా మీయిద్దరి ప్రాణాలకి నేను కనికరించి, అడ్డుపడాలిగాని, మరి యెవరికీ సాధ్యం కాదను కుంటాను

శిష్యు—మాగురువుగారి మాటకేం; ఆయన పెద్దవారు; యేవొచ్చినా సర్దుకోగలరు. నేను పాపం పుణ్యం యెరగని పసిపిల్లవాణ్ణి, నాప్రాణానికి నీప్రాణం అడ్డు వేశావంటే, కీర్తి వుండిపోతుంది.

మధు—నీ గురువుని వొదిలేసి నాదగ్గిర శిష్యరికం చేస్తావా?

శిష్యు—యిదిగో—యీ నిమిషం వొదిలేస్తాను. (బుగ్గలుగాలితో పూరించి పిడికిళ్ళతో తట్టి గురువుతో) మీ నేస్తం యీవేళతోసరి. మరి ఆడవేషం యీ జన్మంలో వెయ్యను.

మధు—నాటకంలోకూడా వెయ్యవా?

శిష్యు—మరి నాటకం గీటకం నాకొద్దు.

మధు—నాదగ్గిర శిష్యరికం అంటే యేవేం చెయ్యాలో తెలుసునా?

శిష్యు—నీళ్ళుతోడుతాను వంటచేస్తాను. బట్టలు వుతుకుతాను. గాని బ్రాహ్మణ్ణి గదా, కాళ్ళుపట్టమనవు గద?

మధు—(విరగబడినవ్వి) యిదా నీగురువుదగ్గిర చేసే శిష్యరికం?

శిష్యు—మరిచిపోయినాను. చిడప్పొక్కులుకూడా గోకుతాను.

మధు—(నవ్వి) పెంకా?

శిష్యు—యే నౌఖరీ చెయ్యమంటే ఆ నౌఖరీ చేస్తాను.

మధు—నన్ను ముద్దెట్టుకొమ్మన్నప్పుడల్లా ముద్దెట్టుకోవాలి.

శిష్యు—ముద్దెట్టుకంటాను.

కరట—వాడు కుఱ్ఱవాడు – వాణ్ణెందుకు చెడగొడతావు ? ఆ శిష్యరికం యేదో వాడి తరఫునా, నాతరఫునాకూడా నేనే చేస్తాను. చాతనైతే చక్రం అడ్డెయి
మధు—"గురువూ శిష్యుడూ శిష్యుడూ గురువాయె"
మీరు శిష్యులు కావాలంటే యిస్కూలు జీతం యిచ్చుకోవాలి.
కరట—పిల్లికి చెలగాటం; యలక్కి ప్రాణపోకటా !
మధు—మీరా యలక ?
కరట—అవును.
మధు—మీరు యలక కారు. పందికొక్కులు, మీ శిష్యుడు యలక.
కరట—పోనీ వాణ్ణయినా కాపాడు.
మధు—అదే ఆలోచిస్తూన్నాను,
కరట—బుద్ధీ బుద్ధీ కలిస్తే రాపాడుతుంది. నీ ఆలోచన యేదో కొంచం చెవినివట్టా యనా నా ఆలోచనకూడా చెబుతాను, కలబోసుకుందాం.
మధు—మీ ఆలోచన ముందుచెప్పండి.
కరట—మరేమీలేదు. నేను పుచ్చుకున్న పన్నెండువొందల రూపాయల నోట్లూ, ఆకంటూ, పోస్టుద్వారాభీమాచేసి గుంటూరు శాస్తుల్లుపేరట, లుబ్ధావధాన్లుకి పంపిస్తాను దాంతోటి కూనీకేసు నిజం కాదని సౌజన్యారావు పంతులుగారు పోల్చుకుంటారు. ఆపైని దైవాధీనం !
మధు—మీకు కంటె యలా వొస్తుంది ?
కరట—నువ్వు అనుగ్రహిస్తేను.
మధు—(ముక్కుమీద వేలువుంచుకుని) చిత్రం ! బ్రాహ్మలు యంతకైనా తగుదురు.
కరట—యేమిఁ అలా అంటున్నావు ?
మధు—నాకంటె తిరిగీ నేను కళ్ళచూడడం యెలాగ ?
కరట—సౌజన్యారావు పంతులుగారు నీ వస్తువ నీకు యిచ్చేస్తారు. ఆయన బహు న్యాయమైన మనిషి.
మధు—అంతమంచివాడా ?
కరట—అందుకు సందేహవేఁమిటి ?
మధు—యెంతమంచివారు ?
కరట—అంత మంచిమనిషి మరి లోకంలో లేడు.
మధు—అయన్ని నాకు చూడాలనుంది, తీసికెళ్తారా ?
కరట—నా అబ్బోరుంటుందా ? ఆయన సానివాళ్ళని చూడరు.
మధు—అంటే నాచ్చి కాబోలు ?
కరట—యింగిలీషు చదువుకున్నవాళ్ళకి కొందరికి పట్టుకుంది యీ చాదస్తం ! అయినా అందులోనూ దేశకాలాలనుబట్టి, రకరకాలు లేకపోవడం లేదు.

మధు— సౌజన్యారావు పంతులుగారిది యేరకం? గిరీశంగారిది యేరకం?

కరట— యేమి సాపత్యం తెచ్చావు? కుక్కకీ గంగి గోవుకూ యెంతవారో, వాడికీ ఆయనకు అంతవార. సౌజన్యారావు పంతులుగారు కర్మణా, మనసా, వాచా. యాంటీనాచి "వేశ్య" అనేమాట, యేమరి ఆయనయదట పలికితివట్టాయనా, "అసందర్భం!" అంటారు ఆయనలాంటి అచ్చాణీలు అరుదు. మిగిలినవారు యథాశక్తి యాంటీనాచులు ఫోజు ఫోజంతా మాటల్లో మహావీరులే అందులో గిరీశం అగ్రగణ్యుడు. కొందరు ఇంట్లు పొగలు యాంటీనాచి, రాత్రి ప్రోనాచి; కొందరు వున్నవూళ్లో యాంటీనాచి, పరాయివూళ్లో ప్రోనాచి; కొందరు శరీరదార్ఢ్యం వున్నంతకాలం ప్రోనాచి, శరీరం చెడ్డతరవాత యాంటీనాచి; కొందరు బతికి వున్నంతకాలం ప్రోనాచి, చచ్చిపోయినతరవాత యాంటీనాచి; కొందరు అదృష్టవంతులు చచ్చిన తరవాతకూడా ప్రోనాచే. అనగా యజ్ఞంచేసి పరలోకంలో భోగాలికి టిక్కట్లు కొనుక్కుంటారు, నావంటి అల్పప్రజ్ఞ కలవాళ్ళు, లభ్యం కానప్పుడల్లా యాంటీనాచె.

మధు— మీ యోగ్యత చెప్పేదేమిటి! గాని, పెద్దుగారి మాటలుచూస్తే, సౌజన్యారావు పంతులుగారు లుబ్ధావధాన్లుగారిని కాపాడడానికి, విశ్వప్రయత్నం చేస్తూ వున్నట్టు కనబడుతుంది. యేమికారణమో?

కరట— చాపలు యీదడానికి, పిట్టలు యెగరడానికి, యేం కారణమో అదే కారణం.

మధు— పరోపకారం ఆయనకు సహజగుణమనా?

కరట— కాకేమి?

మధు— మీరెందుకు, కొంచెం అయీదడం, యెగరడం నేర్చుకోకూడదు?

కరట— నీమాట అర్థంకాలేదు.

మధు— యీ కేసులో నిజవేదో సౌజన్యారావు పంతులుగారితో చెప్పి మీరుకూడా - కొంచం లోకోపకారం చెయ్యరాదా?

కరట— మా మంచి సలహా చెప్పావు! పనకు మాలిన ధర్మమా? "స్వయంతీర్ణాః పరాం స్తారయన్తి" అన్నాడు. నిజం చెబితే పంతులు యేమంటాడో నీకు తెలుసునా? "శాస్తుల్లుగారూ మీరు నేరంచేశారు, నేనేమి చెయ్యగలను? మిమ్మును గురించి నాకు చాలా విచారంగావున్నది" అని వగుస్తూ, పోలీసు వాళ్ళతో చెప్పి, జైయిలులోకి వప్పచెప్తాడు. జైయిలునుంచి తిరిగి వచ్చిందాకా మాత్రం నెలకో పాతికో, పరకో కనికరించి నాభార్యాకు యిస్తూ వుంటాడు. అలాంటి ప్రమాదం లేకుండా కార్యసానుకూలం కావడంకోసమే యీ యెత్తు యెత్తాను.

మధు—సరే, పొజన్యాలాన్ని పంతులుగారు ముందిస్తారు గనక ఆయనదాఁకా వస్తే నాకంటె నాకు యిప్పించేస్తారు గాని, లుబ్ధావఁధాన్లు అరూపాయలూ, కంటా, పెట్లో పెట్టుకుని ముంగిలా మాట్లాడకుండా వూరుకుంటేనో?

కరట—దాని ఖరీదు నేనిచ్చుకుంటాను.

మధు—తమరు ఒకవేళ మఠంలో ప్రవేశిస్తే మరి నాకు కంటె ఖరీదు యిచ్చేవారెవరు? అందుచేత ఆకంటె నాకు తిరిగి వచ్చేవరకూ మీశిష్యుణ్ణి నాదగ్గిర తాకట్టు వుంచండి.

కరట—అలాగనే.

శిష్యు—మీ పొమ్మేంబోయింది, నా పెళ్లో?

కరట—నాలికా తాటిపట్టెరా?

శిష్యు—మీరో వేళ—జయిల్లోకి వెళితే,—

మధు—గురువుకు తగిన శిష్యుడి వౌడువు!

కరట—అంత ఉపద్రవం వొస్తే, నీ పెళ్ళిమాట నా పెళ్ళాంతో యరేంజిమెంటు చేసి మరీ వెళతాను.

శిష్యు—యేమో! ఘోరమైన ప్రమాణం చేశారుగదా?

కరట—మధురవాణి, కొంచం శ్రమచేసి కంటెతేవా?

మధు—యేవొచ్చింది తొందర?

కరట—పొద్దుగాని, రావఁప్పంతులుగాని, వొచ్చాడంటే నాకొంప మునుగుతుంది.

మధు—మునిగితే తేలుస్తాను.

కరట—అంత చాకచక్యం నీకు లేదనికాను.

(మధురవాణి లోనికి వెళ్ళును.)

కరట—అది చెప్పిందల్లా చెయ్యక, కొంచంపై ఒచ్చేది కాని, మరి నడుస్తూవుండు, యేమైనావుంటే, నాచెవిని పడేస్తూండు.

శిష్యు—యవరిదగ్గిర వున్నప్పుడు వారు చెప్పిందల్లా చెయ్యడవేఁ, నా నిర్ణయం. మీరు యేంపైకాని, నాచేత అడవేషంవేయించె పెళ్ళిచేశారో?

కరట—ప్రమాదోధీమతామపి. యంతటివాడికైనా ఒకప్పుడు కాలుజారుతుందిరా!

[మధురవాణి కంటె పట్టుకు ప్రవేశించి]

మధు—తాకట్టు వస్తువ తప్పించుకు పోరిపోతేనో? కుక్కా, నక్కా, కాదుగదా గొలుసులువేసి కట్టడానికి?

కరట—నీవలల్లో పడ్డప్రాణి మరి తప్పించుకు పోవడం యలాగ? వాటికి వున్న పటుత్వం యేవుక్కు గొలుసులకూ వుండదు.

మధు—వలలో ముత్యపు చిప్పలు పడితే లాభం గాని, నత్తగుల్లలు పడితే మోతఁ చేటు,

కరట—యంత సేవూ డబ్బు తెచ్చేనా ? స్నేహాం, వలపూ, అనేవి వుంటాయా ?

మధు—స్నేహాం మీలాంటివారిచోట; అందుచేతనే కష్టపడి ఆర్జించిన కంటె మీపాలు చేస్తున్నాను. మాతల్లి చూస్తే భవిష్యంవుంచునా ? యిగ వలపో ? బతుకనేది వుంటే, వలపు వన్నె తెస్తుంది. అంగడి వాడికి మిఠాయిమీద ఆశా, సాని దానికి వలపూ, మనస్సులోనే మణగాలి; కొద్దికాలంవుండే యవ్వనాన్ని జీవనాధారంగా చేసుకున్న మా కులానికి వలపు ఒక్కచోటే.

కరట—యక్కడో ?

మధు—బంగారం మీద, శృంగారం వన్నె చెడిన దగ్గిరనుంచీ, బంగారం గదా తేటు తేవాలి ? ఆ బంగారం మీకు ధారపోస్తూ వున్నప్పుడు నా స్నేహాం యెన్ననేల ?

కరట—నీ స్నేహాం చెప్పే దేవిటి ! గాని నీ యౌవ్వనం, నీ శృంగారం దేవతా స్త్రీలకువలె శాశ్వతంగా వుంటాయి,

మధు—మాతల్లి ధర్మవాం అని, ఆమె నాచెవిలో గూడు కట్టుకుని బుద్ధులు చెప్ప బట్టిగాని, లేకుంటే మీలాంటి విద్వాంసుల యిచ్ఛలకి మైమరచి, యీపాటి వూళ్లో సానులవలె చెడివుండనా ?

కరట—మీతల్లి అనగా యెంత బుద్ధివంతురాలు ! దాని తరిఫీదుచేతనే నువ్వు విద్యా సౌందర్యాలు రెండూ దోహదంచేసి పెంచుతున్నావు ?

మధు—అంతకన్న కాపుమనిషినై పుట్టి, మొగుడి పొలంలో వంగ మొక్కలకూ, మిరప మొక్కలకూ దోహదంచేస్తే, యావజ్జీవం కాపాడే తనవాళ్ళన్నవాళు వుందురేమో ?

కరట—యేమి చిన్నమాట అన్నావు ! మధురవాణి అంటూ ఒక వేశ్యాశిఖామణి యీ కళింగరాజ్యంలో వుండకపోతే, భగవంతుడి సృష్టికి యంతలోపం, వచ్చి వుండును ?

మధు—సృష్టికి లోపం వచ్చినా రాకపోయినా, యిప్పటి చిక్కులలో మీకుమట్టుకు కించిత్ లోపం వచ్చివుండును.

కరట—మమ్మల్ని తేల్చడానికి నీ ఆలోచన యేదో కొంచం చెప్పావుకావుగదా ?

మధు—నన్ను సౌజన్యారావు పంతులుగారి దగ్గిరకు తీసుకువెళ్ళడానికి వొప్పారు కారుగదా ?

కరట—ఆయన నిన్నూ, నన్నూ యింట్లోంచి కఱ్ఱపుచ్చుకు తరుముతారు.

మధు—కోపిష్టా ?

కరట—ఆయనకి కోపవన్న మాటే లేదు.

మధు—ఐతే భయమేల ?

కరట—చెడ్డవారివల్ల చెప్పుదెబ్బలు తినవచ్చునుగాని, మంచివారివల్ల మాటకాయడం కష్టం.

మధు — కొత్తసంగతి వకటి యీనాటికి నాకు తెలిసింది. సృష్టికల్లా వన్నె తెచ్చిన మధురవాణి అనే వేశ్యాశిఖామణి గిరీశంగారివంటి కుక్కలపొత్తుకే తగి వున్నది గాని, సౌజన్యారావు పంతులుగారివంటి సత్పురుషులను చూడడమునకైనా అర్హత కలిగివుండలేదు. గిరీశంగారు దానియింట అడుగుబెట్టగానే, మీ చెల్లెలుగారియింట, అడుగుపెట్టడానికి ఆయనకు యోగ్యత తప్పిందని మీ నిర్ణయం. తమలాంటి పండితోత్తములుమాత్రం కార్యావసరం కలిగినప్పుడు వూరూవాడా వెతికి మధురవాణిదగ్గర లాచారీపడవచ్చును. అయితే డిప్టీ కలక్టరూ కుక్కేనా?

కరట — లంచం తినడుగాని ఆయనకు స్త్రీ వ్యసనంకద్దు. పెద్ద వుద్యోగస్థుడు గనక, సీమకుక్క అని అందాం, ఆయన్నిగానీ వలలో వేశావా యేవిఁటి?

మధు — వేస్తే?

కరట — బతికానన్నమాట! ఆయన సాయంవుంటే, కేసు మంచులా విడిపోతుంది. తెలిసింది. యిదా, నువ్వుచేసిన ఆలోచన! యెంత గొప్పదానివి!

మధు — ఆయన నాయుడుచేత రాయబారాలు పంపుతున్నారు.

కరట — వెళ్ళు, వెళ్ళు, వెళ్ళు, వెళ్ళు, యింకా ఆలోచిస్తావేవిఁటి? నీ అదృష్టం నా అదృష్టం యేవఁని చెప్పను!

మధు — వెళ్ళతలచుకోలేదు

కరట — చంపిపోతివే! ఆయన ఒక్కడే మమ్మల్ని కాపాడగలిగినవాడు.

మధు — యిటుపైని వూరకుక్కలనూ, సీమకుక్కలనూ, దూరంగా వుంచడానికి ఆలోచిస్తున్నాను.

కరట — ఆయనని హాస్యానికి సీమకుక్క అని అన్నానుగాని, యెంత రసికుడనుకున్నావు? నీతికి యేమిక లేదే! హెడ్డుకనిష్టీబుపాటి చేశాడుకాడా?

మధు — పట్నంవొదిలి పల్లెటూరు రాగానే, మీదృష్టిలో, పలచనైతినో? హెడ్డును నౌఖరుగా తిప్పుకున్నానుగాని అధికంలేదే? ఆ నాలుగురోజులూ, సర్కారు కొలువుమాని అతడు నాకొలువు చేశాడు. అతడి సాయం లేకపోతే, మీరు ఆవూరి పొలిమేర దాటుదురా? యీ దాసరి దాటునా? లోకం అంతా యేమి స్వప్రయోజకపరులూ!

కరట — అపరాధం! అపరాధం! కలక్టరుని చూడనంటే, మనస్సు చివుక్కుమని అలా అన్నాను. నువ్వు ఆగ్రామం గ్రామం సమూలం రాణీలాగ యేలడం నేను యీ కళ్ళతో చూడలేదా?

మధు — నేను కలక్టరును చూడనంటే, మీమనస్సు చివుక్కుమనడం యెట్టిది? యేమి చిత్రం! సౌజన్యారావు పంతులుగారు యీమాటవింటే సంతోషిస్తారు కాబోలు!

కరట—పీక వుత్తరిస్తారు.

మధు—అదేదో చూస్తాను.

కరట—బ్రహ్మహత్య కట్టుకుంటావా యేమిటి?

మధు—ఆహా! యేమి బ్రాహ్మలూ!—అయినా పోలిశెట్టి చెప్పినట్టు, యెంత చెడ్డా బ్రాహ్మలుగదా? యిందండి; (కంటె యిచ్చును) తిలోదకాలేనా?

కరట—యెంతమాట! పువ్వులలో పెట్టి మళ్ళీరాదా? నీయెదట అనవలిసిన మాట కాదు. నీలాంటి మనిషి మరిలేదు. కించిత్ తిక్కలేకుంటేనా!

మధు—అతిక్కేగదా యిప్పుడు మీకు వుపచరిస్తూంది?

కరట—యేం వుపచరించడం? చంపేశావు! ఆ డిప్టీకలక్టర్ని ఒక్కమాటు చూసి యీ బీదప్రాణిని కాపాడితే—

మధు—చాలించండి. యిక విజయం చెయ్యండి (పెళ్ళిబొమ్మని చేతితో సాజ్ఞచేయును. కరటకశాస్త్రుల్లు, శిష్యుడు నిష్క్రమించుచుండగా) శాస్త్రుల్లుగారూ!

[కరటక శాస్త్రుల్లు తిరిగి ప్రవేశించును]

మధు—మీపిల్లని మహేశానికి యిస్తారా?

కరట—యిస్తాను.

మధు—అయితే నాకో ఖరారు చేస్తారా?

కరట—చేస్తాను.

మధు—యిక అతణ్ణి నాటకాలాడించీ, ముండలెళ్ళతిప్పి చెడగొట్టకండి.

కరట—యిటుపైని చెడగొట్టను — నాకు మాత్రం అక్కర్లేదా? (పొడుంపీల్చి) నీది గురూపదేశం, మధురవాణీ!

మధు—బ్రాహ్మలలో ఉపదేశంలావూ, ఆచరణ తక్కువా, ఖరారేనా?

కరట—ఖరారే.

మధు—బ్రాహ్మలుకాగానే, దేవుడికంట్లో బుగ్గిపొయ్యాలేరు అనుకుంటాను.

కరట—చివాట్లకిదిగా వేఁవిటి?

మధు—చిత్రగుప్తుడికి లంచం యివ్వగలరా? అతడి దగ్గిరికి మధురవాణిని పంపి, చేసిన పాపాలు అన్నీ తుడుపుపెట్టించడానికి వీలుండదు కాబోలు?

కరట—మధురవాణీ! జరూరు పనివకటుంది. మరచిపోయినాను — వెళ్ళి, రేపు మళ్ళీ వస్తాను.

మధు—(నవ్వుచేత కుర్చీమీద విరగబడి, తరవాత నవ్వు నదమాయించుకొని) ఒక్క నిమిషం ఆగండి. శిష్యుడా! (శిష్యుడు ప్రవేశించును) యేదీ, నాడు నువ్వు రామచంద్రపురం అగ్రహారంలో, రామప్పంతులు యింటి బైటనూ, నేనూ మీనాక్షమ్మా తలుపు యివతలా అవతలా ఖణాయించి వుండగా, తెల్లవార ఝామున నిశ్శబ్దంలో ఆకాశవాణిలా పాడిన చిలక పాట పాడి నీమావఁగారికి

బుద్ధి చెప్పు. తమ మూలంగా ఒక ముసలి బ్రాహ్మడికి ముప్పువస్తూంటే తమ పకీరీం దాచుకుంటున్నారు.

శిష్యు—(పాడును) యెట్లని ముక్కుగలది రామచిలుక । కాని

మధు—(బెత్తముతో కొట్టబోయినట్లు నటించి) చెప్పినపని చెయ్యకపోతే జయిలు సిద్ధం.

శిష్యు—("యెన్నాళ్లు బ్రతికినా" అను పాట పాడును రెండు చరణములు పాడిన తరువాత.)

కరట—అతిజరూరు పనివుంది మధురవాణీ మరోమాటువస్తాను (నిష్క్రమించుతూ) తలవాయ గొట్టింది. తెల్ల వెంట్రుకలు లావయినాయి — మనసు కొంచం మళ్ళించుకుందాం.

## 2–వస్థలము సౌజన్యారావు పంతులుగారింట్లో కచేరీగది

[సౌజన్యారావు పంతులుగారు, అగ్నిహోత్రావధాన్లు ప్రవేశింతురు.]

సౌజ—ఇక మిమ్మల్లను జయించినవాడులేదు. పిల్లల్ని అమ్ముకోవడం శిష్టాచారం అంటారండీ

అగ్ని—అహా. మా మేనత్తల్ని అందరినీ కూడా అమ్మారండి వాళ్ళంతా పునిస్త్రీ చావే చచ్చారు; మాతండ్రి మేనత్తల్ని కూడా అమ్మకవేం జరిగిందమ. యిప్పుడు యీ వెధవ యింగిలీషు చదువునుంచి ఆ పకీరు వెధవ దాన్ని లేవదీసుకుపోయి నాడుగాని. వైధవ్యం అనుభవించిన వాళ్ళంతా పూర్వకాలంలో యెంత ప్రతిష్ఠగా బతికారు కాదు ?

సౌజ—పసిపిల్లల్ని కాలంగడిచినవాళ్ళకి పెళ్ళిచేస్తే వైధవ్యంరాక తప్పుతుందా ? నిం పాదిచేసి కొంచం యోచించండి.

అగ్ని—ప్రారబ్ధం చాలకపోతే ప్రతివాళ్ళకీ వస్తుందండీ — చిన్నవాళ్ళకిచ్చినా. పెద్ద వాళ్ళ కిచ్చినా, రాసినంత యెవడైనా తప్పించగలడా ?

సౌజ—మీరు చదువుకున్నవారుగదా, ప్రారబ్ధుని పురుషప్రయత్నం యే వ్యవహా రంలో మానేశారు ? కేసు, "విధికృతం; యలావుంటే అలా అవుతుందని" వకీల్ని పెట్టడం మానేశారా ? కన్యలని అమ్ముకోవడం శాస్త్రదూష్యంకాదా డబ్బుకిలోభించి పిల్లన్ని ముసలవాళ్ళకి కట్టబెట్టి విధికృతం అనడం న్యాయ మేనా ? శలవియ్యండి.

అగ్ని—యిప్పుడు మీ శాస్త్రాల్లో వేయ్యేసి, రెండేసివేలు, వరకట్నాలు పుచ్చుకుం చున్నారుకాదండీ ? గిరీశంగారు చెప్పినట్టు—వాడి పిండం పిల్లులికిపెట్టా !— మీలో ఆడపిల్లలకి యిన్ని తులాలు బంగారం పెట్టాలి యిన్ని తులాలు వెండి పెట్టాలి అని నిర్ణయించుకోవడంలేదా ? అదిమాత్రం కాదేం కన్యాశుల్కం?

సౌజ—అలా చెయ్యడం నేను మంచిదన్నానా యేమిటండీ? "గిరీశంగారు చెప్పి నట్టు" అని అన్నారేవిటి?

అగ్ని—ఆ వెధవపేరు నాయెదట చెప్పకండి.

సౌజ—కానీయండిగాని - మీ రెండోపిల్లకి తగిన వరుణ్ణిచూసి పెళ్ళి చెయ్యండి. యేం సుఖపడుతుందని ముసలివాళ్ళకి యివ్వడం? శలవియ్యండి.

అగ్ని—అదంతా మీకెందుకయ్యా? ఓహో యిందుకా నన్ను పిలిపించారు? మీ గృహకృత్యాల పూసుకి నేవొచ్చానా యేవిటి? నా గృహకృత్యాలపూసు మీకెందుకూ?

సౌజ—తొందరపడకండి అవుధాన్లుగారూ, దూరం ఆలోచించండి - మీ కడుపున బుట్టిన పిల్లయొక్క సౌఖ్యం ఆలోచించి సలహా చెప్పాను గాని, నా స్వలాభం ఆలోచించి చెప్పలేదు గదా - పెద్దపిల్లకి సంభవించిన అవస్థ మీ కళ్ళతో చూడనే చూశారు యికనైనా వృద్ధులకు పిల్లని కట్టబెట్టడపు ప్రయత్నము చాలించండి.

అగ్ని—నా పిల్లభారం అంతా మీదైనట్టు మాట్లాడుతున్నారేమిటి? ఆ సంత మీ కెందుకూ?

సౌజ—నన్ను తమ స్నేహవర్గంలో చేర్చుకోండి-పరాయివాణ్ణిగా భావించకండి—దయచేసి నా సలహా వినండి—మర్యాదగలయింట పుట్టిన బుద్ధిమంతుడగు కుఱ్ఱవాణ్ణిచూసి మీ చిన్నపిల్లని పెళ్ళిచెయ్యండి. యిక పెద్దపిల్లమాట—ఆమెకు వితంతువుల మఠంలో, సంఘసంస్కారసభవారు విద్యాబుద్ధులు చెప్పించుతారు. మీకడుపున పుట్టినందుకు యెక్కడనయినా ఆమె సుఖంగా వుండడం గదా తండ్రైనవారు కోరవలసినది. ఆమె తాలూకు కొంతఆస్తి తమవద్దవున్నది. మా స్నేహితులున్నూ, శ్రీ పునర్వివాహ సభకార్యాధ్యక్షులున్నూ అయిన రామయ్యపంతులుగారు నా పేర వ్రాసినారు, ఆ ఆస్తి, చిక్కులు పెట్టక, తాము ఆపిల్లకి పంపించి వెయ్యడం మంచిది.

అగ్ని—యేవిటీముండా యేకువునంత! వాడెవడు? వీడెవడు? మీరెవరు? అదెవర్త? నాపిల్లేవిటి, వకీరుముండ! రేపు యింటికి వెళుతూనే ఘటశ్రాద్ధం పెట్టేస్తాను.

సౌజ—యిప్పటి ఆగ్రహంమీద మీరు అలా శలవిచ్చినా, నిడివిమీద మీకే కనికరం పుడుతుంది యిప్పట్లోనే మీరు కనికరిస్తే కొంత మీకు నేను ఉపకారం చెయ్యగలను.

అగ్ని—కనికరంగాకేం. కడుపులో యేడుస్తున్నాను కానూ! ఆస్తి గిస్తి యిమ్మంటే మాత్రం యిచ్చేవాణ్ణికాను. ఆ వెధవని పెళ్ళిచేసుకోకుండా యిల్లు జేరితే యింట్లో బెట్టుకుంటాను, అంతే.

సౌజ—అది మరిజరగదు.

అగ్ని—యిది అంతకన్న జరగదు

సౌజ—ఆమె ఆస్తి మీరు యిచ్చివెయ్యకపోతే దావా పడుతుంది. నిష్కారణం ఖర్చులు తగులుతవి

అగ్ని—నేను అగ్రహారపుచెయ్యిని—దావాగీవా అని బెదిరించితే భయపడేవాణ్ణి కాను.

సౌజ—నామాటవిని ఆస్తియిచ్చివేసి గిరీశంగారిమీద గ్రంథంచెయ్యడపు ప్రయత్నము మానుకుంటే. లుబ్ధావధాన్లుగారు మీమీద తెచ్చిన కేసు తీయించివేస్తాను—మీపిల్లమీద దయాదాక్షిణ్యాలు లేకపోతే. స్వలాభమైనా ఆలోచించుకోండి.

అగ్ని—వెధవముండని లేవదీసుకుపోయిన పకీరువెధవపక్షం మాట్లాడుతావు; యేమి పెద్దమనిషివయ్యా? నేనా కేసు పొందులుకుంటాను? ఆ వెధవగానీ కంటికి కనపడితే, కూసీచేస్తాను. పెద్దప్లీడరు ప్రత్యుద్థానంచేసి పిలిచాడంటే, కేసుల్లో యేమి సలహా చెబుతాడో అని భ్రమపడ్డాను. వెధవముండలకి పెళ్ళిచెయ్యడపు పోయీకాలం పట్టుకుందేమి, పెద్దపెద్దవాళ్ళకి కూడాను?

సౌజ—లుబ్ధావధాన్లుగారి తరఫున మీమీద గ్రంథం చేనే నడిపించవలసి వుంటుంది మీకు వృథాగా డబ్బు తట్టుబడీ, సిక్షా, కుంట్రాంకూడా సంభవిస్తాయిగదా అని యింత దూరం చెప్పాను. మంచికి మీరు మనుష్యులైనట్టు కనపడదు గనక నా శాయశక్తులా పనిచేసి మీకు గట్టి సిక్ష అయేటట్టు గ్రంథం నడిపిస్తాను. పిల్లదాని ఆస్తివిషయమయి దావాకూడా నేనే పడేస్తాను.

అగ్ని—నీయింట కోడికాల్చా!

సౌజ—మీరు యేమన్నా, నాకు కోపంలేదు. యింటికివెళ్లి ఆలోచించుకుని, నా సహాయం కావలిసివుంటే తిరిగిరండి.

అగ్ని—(నిష్క్రమించుతూ తనలో) వీడికి వెఱ్ఱిగాబోలు!

(తెరదించవలెను.)

—౦—

శ్రీ

# కన్యాశుల్కము



*　　　*　　　*

## సప్తమాంకము



### ౧-వ స్థలము : విశాఖపట్టంలో వీధి

[బైరాగీ, వెనుక పదిమంది శూద్రులూ ప్రవేశింతురు.]

రామ—యెక్కణ్ణించి యిజయం సేస్తున్నారు గురూ ?

బైరా—కాశీనుంచిరా.

రామ—యెన్నాళ్లైంది గురూ ?

బైరా—ప్రాతఃకాలం గంగ సేవించి బయల్దేరాము రా.

రామ—యింత యేగిరం యెలాగొచ్చినారు. గురూ ?

బైరా—పవనం బంధించి వాయువేగం మీదవచ్చాము రా.

బుచ్చ—యోగులికి సిద్ధులుండవురా ? యీయనే రా, ఉప్పాకలోనూ సింహాచలం లోనూ మొన్న సివరాత్రికి వొక్కమారే అగుపడ్డారు.

లత్మ—తెల్లోడు తీగిటపా యేసినాడు కాద్రా? నిమేటికి వుత్తరం దేశదేశాలికి యెల్లదా ?

బైరా—పామరులు ! పామరులు !

రామ—వూరుకొస్సి—నీకేటెరిక—యెఱ్ఱినాకొడక,

బైరా—యీవూళ్లో తీర్థపురాళ్ళ రేవున రెండుమైళ్ళ లోసబురున ధర్మరాజువారు ప్రతిష్ఠచేసిన శివాలయం, కంచుదేవాలయం ఒకటి వున్నది. రాత్రి ఆదేవుణ్ణి సేవించుకుని, రేపు రామేశ్వరం వెళ్ళిపోతాం. సదావృత్తి యక్కడదొరుకు తుంది ?

రామ—యీ ఊళ్లో మఠంలేదు గురూ, మేవంతూడగ తమకి లోపవేఁటి గురూ ? కాశీ కబుర్లేటి గురూ ?

బైరా—నాలుగురోజులు కిందట విశ్వేశ్వరుడి కోవిలలో ఒక బంగారపు రేకు ఆకాశంమీంచి పడ్డది. దానిమీద వ్రాసినలిపి బ్రాహ్మలికి యెవరికీ బోధ అయిందికాదు మేం చిత్తగించాం, సిద్ధులభాషని దానిమీద బంగా రంచేసే యోగం వకటి కలకాలంబతికే యోగం వకటి వ్రాసివున్నాయి.

రామ — యేవాంఛిత్తాం! గురూ భోజనం యేటారగిస్తారు ?

బైరా — పాలూ, పంచదారా, అరటిపళ్ళములూ, యీప్రకారం ఒకపక్షం ఫలహారం చేస్తాము, మరి పదిహేనురోజులు వాయుభక్షణ చేస్తాము,

రామ — ఒక్క మిట్టికాయలో ఫలారం జాగర్త చేస్తాం గురూ. మా రాంసుందిరానికి దయసెయ్యాలి.

బైరా — పద—యీవూరి వింతలేవిటి ?

లక్ష్మ — యేటిలేవ్—రామచంద్రపురం అగ్రహారంలో ముసలబాపనోడు ఆల్నిసంపేసినాట్ట. అడికి దొంగసాచ్చికం పలికినోళ్ళకీ తాసీలుగోరికీ సిచ్చైపోతాదిట.

బైరా — యీవూరు పాపంతో నిండి వున్నట్టు కనపడుతూంది. యీవూళ్లో మేము నిలవము.

రామ — అచ్చపుడు వెళ్ళొద్దు గురూ. ఆడిమాట నమ్మకండి. మీరెళ్ళిపోతే మాలాటోళ్ళు తరించడం యలాగ్గురూ? ఆళ్ళ వూరోళ్ళుకాదు.

బుచ్చన్న — యీవూరి దుకాణదారుగారు అదుగో వొస్తున్నారు.

బైరా — యీవూళ్లో తాగడం లావుగావున్నట్టు కనపడుతుంది. మేము తాగుబోతులతో మాట్లాడం—యీదుకాణదారు వచ్చేలోగా యీ సందులోకి మళ్ళిపోదాం; రండి (దుకాణదారు పరుగు వచ్చి కలిసి బైరాగి మెడలో చెయివేసి పట్టుకొనును.)

దుకా — రూపాయలుకక్కి మరీ కదలాలి !

బైరా — యేమిటీ వాళ్ళకం! వీడు తప్పత్రాగి పేలుతున్నాడు—నేను మొదటే చెప్పలేదా యీవూరి సంగతి? అంతా పాపంతో నిండివుంది! వేమన్న యేమన్నాడు

"త్రాగుబోతుతోడ తగదెందు నేస్తంబు"

రామ — (దుకాణదారుతో) భాయీ! నీకేటి, మతోయిందా ? గురువుగోరికిదణ్ణ వెట్టి లెంపలో యించుకోండి.

దుకా — గురువూలేదు, గుడ్రూలేదు పూరుకోస్సి—యీదెక్కడి గురువు? నాదుకాణంలో సారా అంతా చెడతాగి డబ్బియ్యకుండా యెగేసినాడు.

రామ — మీకు మతోయిందా భాయి? ఆరేటి మీదుకాణంలో తాగడవేఁటి, కాశీనించి యిప్పుడే ఒచ్చినారుగదా?

దుకా — ఆకాశం బొక్కచేసుకుని వొచ్చాడు కాదూ? (బైరాగితో) డబ్బిచ్చి మరీ కదులు.

బైరా — మావంటి సాధువులతో నీకు వాదెందుకు అబ్బీ? యవర్నిచూసి మేమనుకున్నావో! మమ్మల్ని పోలిన దొంగవాడొకడు, బైరాగి వేషం వేసుకుని యీ దేశంలో తిరుగుతున్నాడు. కిందటిమాటు మేం దేశసంచారం చేసినప్పుడు చూసి చీవాట్లు పెట్టాం. నీకు డబ్బుమీద అంత కాపీనంవుంటే తులం రాగి

తెచ్చుకో బంగారం చేసియిస్తాం. సంగోరు ధర్మఖర్చుచేసి సంగోరు తిను. లేకుంటే తల పగిలిపోతుంది.

రామ— యేం యెట్టిముండావని చేసినారు భాయీ! బంగారం చేసేసిద్ధులికి డబ్బు లెచ్చంటోయి? ఆరికాళ్ళమీదపడి అలక తీరుసుకోండి.

మకా— వుండోస్సి— యేడిసినట్టేవుంది. నీ సొమ్మేం పోయింది?

[హెడ్కనిస్టీబు ప్రవేశించును]

హెడ్— యేమండోయి గురోజీ! మీరు దొరకడం నాకు దేవుఁడు దొరికినట్టుంది, ఇక బతికాను. మీతో కొన్ని జరూరు సంగతులు మాట్లాడాలి, రండి.

బైరా— భాయీ- మీరు వెనక్కుండండి. (మకాంఁ దారుతప్ప తక్కినవారు దూరముగా వెళ్ళుదురు.)

మకా— వాడబ్బిచ్చి మరీ మాట్లాడండి.

బైరా— నలుగురిలోనూ మర్యాదతియ్యడం ధర్మంవేఁటా తమ్ముఁడా? యోగరహస్యాలు పామరుల దగ్గిరా వెల్లడిచెయ్యడం?

మకా— డబ్బు యెగెట్టుపు యోగం నాదగ్గిర సారదు. రహస్యవేఁటి? ఆ విద్యకి అంతా గురువులే!

బైరా— వెట్టి నరుఁడా! బైరాగివాళ్ళకి మాకు డబ్బుమీద తనువుంటుందటోయి? ఒకళ్ళకి యిచ్చేదీకానం- పుచ్చుకున్నదీకానం.

హెడ్— భాయీ! నీరూపాయలు సేనిస్తాను. తెలివిమాలిన మాటలాడకు, గురువుగారికి కళ్ళు మొయ్యా ఆగ్రహం వొఁస్తే మనం మండిపోతాం. మీరటుండా, వెళ్ళండి. (బైరాగితో) గురోజీ! కూనీకేసు పీకలమీదికొచ్చింది. కేసూ, యే బుగ్గిలేనిదే. ఆరాత్రి నాలుగురాళ్ళు తడువుఁకుంచావఁని మనం ఆ ముసల్దాణ్ణి అల్లరి పెట్టావాఁ? ఆతరవాత, తాసిల్దారొచ్చి "హాత్ హూత్" అని బెదిరించి పదిరాళ్ళు లాగాడు. తన తాలూకుకంటె పెగిలిందికాదని రావఁప్పంతులుగాడు, యినస్పెక్టరికీ పోలీసు సూపరెంటుకీ అర్జీలు కొట్టాడు. నిజంగా కూనీ కేసు జరిగి వుండగా. మేవుఁ కామాపు చేశావఁని తాసిల్దారుమీదా, నామీదా యిప్పుడు పితూరీ చేస్తున్నారు.

బైరా— మేవుండగా మీకేం భయం, భాయి?

హెడ్— అందునేగదా, నాపాలిటి దేవుళ్లా మీరు దొరకాన్నాను.

బైరా— మీశత్రువులకు వాగ్బంధం చేస్తాను వాళ్ళపేర్లు వ్రాసియివ్వండి. యినస్పెక్టరుకి మీమీద యిష్టవఁని చెప్పేవారే?

హెడ్—యీ పెద్ద వుద్యోగస్థులకి దయలూ దాక్షిణ్యాలూ యేవిఁటి గురూ? వాళ్ళకి యెంత మేపినా, వాళ్ళకి కారట్టు వొస్తుందనిగాని, ప్రమోషను వొస్తుందనిగాని, ఆశ పుట్టినప్పుడు, తెగని కత్తితో పీకలు తెగగోస్తారు. మా యినస్పెక్టరికి సూపరెంటుపని కావాలని ఆశుంది. తసీల్దారికీ వాడికీ బలవద్విరోధం వుంది. ఆ విరోధం మధ్య నన్ను కొట్టేస్తూంది.

బైరా—చూస్తూవుండండి; రేపటినుంచి పతకం తిరిగిపోతుంది.

హెడ్—చిందయ, గురూ - సౌజన్యారావు పంతులుగారని ఓ గొప్ప వకీలుగారున్నారు ఆయన నాకు చాలాసాయం చేస్తున్నారు కేసు తేలిపోయేసాధనం ఆయన వొకటి చెప్పారుగాని, అది కుదరక తల్లడిల్లుతున్నాం.

బైరా—యేమిటండి ఆ సాధనం?

హెడ్—పరారీ అయిపోయిన ఆపిల్లదాని తండ్రి - గుంటూరు శాస్తుల్లని ఒకడు వున్నాడు. అతగాడు దొరికితే, కేసు పోతుంది. వాడు యెక్కడా కనపడ్డు.

బైరా—యిదెంతపని, రాత్రి అంజనంవేసి ఒక్కక్షణంలో కనుక్కుంటాను.

హెడ్—ఆలారక్షించు గురూ. ఆ కుఱ్ఱాడు—అనగా అచిన్నది - యిప్పుడు యెక్కడుందో కనుక్కోగలరూ, గురూ?

బైరా—అదీ అంజనంలోనే కనపడుతుంది.

హెడ్—అది మొగాడయినా, ఆడదయినా కూడా కనపడుతుందా గురూ?

బైరా—ఆడది మొగాడెలా అవుతుంది భాయీ?

హెడ్—(తనలో) చెబితే యేం ప్రమాదవో! (పైకి) యీ చిక్కుల్నించి మతిపోతూంది గురూ. దయచేండి, యింటికెళదాం,

బైరా—యీ శిష్యులకి కొంచం జ్ఞానోపదేశంచేసి మరీవస్తాను. మీరు ముందు నడవండి.

హెడ్—యీకార్యం అయిందాకా మీపాదాలు వొదలను - కార్యమైతే తమరు హరిద్వారంలో కట్టిస్తూన్న మఠానికి నూటపదహార్లు దాఖలుచేస్తాను.

(అందరూ నిష్క్రమింతురు)

## ౨-వ స్థలము : డెప్యూటీకలెక్టర్ కచేరీ.

[డిప్టీకలక్టరు, వకీళ్ళు, బంట్రౌతులు, మొదలైనవారు ప్రవేశింతురు]

భీమా—నాకు మునసబుకోర్టులో కేసున్నది, వొక అర్జీ దాఖలుచేసి శలవు పుచ్చుకుంటాను.

కలె—కోర్టువారికి అవకాశం అయేవరకూ వుండలేని వకీళ్ళు కేసు యెందుకు దాఖలుచేయవలె? ఇది చెప్పినట్టల్లా వచ్చే కోర్టనా మీయభిప్రాయం?

భీమా—చిత్తం, చిత్తం, తమ ప్రిడిశెసర్లు అలాగు గడుపుతూవచ్చేవారు.

కలె—ఆఫీస్‌పని చూసుకుని పిల్చేవరకూ ఉండండి.

అగ్నిహో—(రామప్పంతులుతో) యేమండోయ్ మన కొత్త వకీల్ని కోప్పడు తున్నారే ?

రామ—(అగ్నిహోత్రావధానులుతో) యీ అధికార్ల నైజం యేమిటంటే యెవళ్. మీద దయవుండీ యెవళ్ళపక్షం కేస్ చెయ్యాలంటే వాళ్ళని కసర్కొట్టినట్టు కనపడతారు, మీరు కోర్టుసంగతంతా తెలుసునంటారే ? యిదేనా మీ అనుభవం ?

అగ్ని—(గట్టిగా) అవునవున్నాకు తెలుసును.

కలె—యెవరా మాట్లాడుతున్న మనిషి ?

నాయుడు—(లేచి) తక్‌షీర్ మాఫ్ చేస్తే మనవిచేస్తాను యీయన కృష్ణారాయపురం అగ్రహారం కాపురస్తుడు. నుంక అగ్నిహోత్రావధాన్లుగారు; మహా (అ) యోగ్యమైన బ్రాహ్మడు, జటాంతస్వాధ్యాయి, యీయనే లుబ్ధావధాన్లుగారికి తన కొమార్తెను పద్దెనిమిదివందల రూపాయలకు, కన్యాదానం చేయడానికి బేరమాడుకుని, కాబోయే అల్లుడికి దేహశుద్ధి చేశారు; అందుకే యీమధ్య లుబ్ధావధాన్లుగారు యేలినవారి కోటులో ఛార్జి దాఖలుచేశారు. అందులో ముద్దాయీ యీ మహానుభావుడే! మల్లవరంలో సహా! సమానజీనైన వక బ్రాహ్మణ శ్రేష్ఠుడుంటే, ఆయనకు తన పెద్దకుమార్తెను కన్యాదానం చేసి, రెండు పిల్లికూనలు స్వీకరించేటప్పటికి పెళ్ళిలోనే ఆ బ్రాహ్మడిపుణ్యాం అంతామూడి పరం పదంపీం చేశాడు. ఆపిల్లదాని తరఫున భూములకొరకు దావా తెచ్చారు. వీరు తమవంటి గవర్నమెంట్ ఆఫీసర్లలకి తరుచుగా పనిగలుగచేసి ప్లీడర్లని పోషిస్తూ వుంటారు. వీరి యోగ్యత లేమి, వీరి దయాంతఃకరణ లేమి, వీరిసరసత లేమి మరి యెన్నడమునకు శేషుడికైనా అలవికాదు. వారి తరఫున కేసు దాఖలు చెయ్యడంకోసమే భీమారావు పంతులుగారు కోటుకు దయచేశారు. (వినయముగా నవ్వి కూరుచొనును.)

కలె—బలేశాబాష్ (గుమాస్తాతో) ఏదీ భీమారావు పంతులుగార్ని ప్రియాదు అర్జి దాఖలుచేయమను. (గుమస్తా పుచ్చుకొని దాఖలుచేయును)

కలె—(కాగితమందుకొని) యేమిటయ్యా కేసుస్వభావం ?

భీమా—చిత్తం, యీయన వెధవకొమార్తెని యీయన కొమార్తుడికి చదువుచెప్పే గిరీశం అనే ఆయన అలంకారాలూ, ఆస్తితోకూడ లేవతీసుకు వెళ్ళిపోయినాడు.

అగ్ని—దస్తావేజులూ; కోటుకాయితాలూ కూడానండి.

కలె—యేమిటి ! ఆహా, హా, హా, హా, (నవ్వుచు బూట్సు నేలపై తట్టును) బలే శాబాష్ (అర్జిచూచుకొని) యిన్నాళ్ళేమి చేస్తున్నారు ?

భీమా — తహసీల్దార్‌గారి దగ్గిర నేరం జరిగిన మూడోరోజునే మునసబుకోర్టు వకీలు వెంకట్రావు పంతులుగారు, ఛార్జి దాఖలు చేస్తే ఆ తహసీల్‌దారుగారు కేస్ స్వభావం యేమిటని అడిగినారు. ఎబ్‌డక్షన్ అని వెంకట్రావు పంతులుగారు చెప్పేసరికి యింగ్లీషు రాకపోవడంచాత, తహసీల్దారుగారు ఆ మాట యెప్పుడూ విన్లేదని చెప్పారు. తరవాత కేస్ స్వభావం తెలుగున చెప్తే యిలాంటి నేరం మా జూరిస్‌డిక్షన్‌లో జరగదు. తోవలో రోడ్డుమీద యేతాలూకా సరిహద్దులో యెత్తుకు పోయినాడో అని అర్జీ దాఖలు చేసుకున్నారు కారు. లుబ్ధావధాన్లుగారి కూనీ కేసు కామాప్ చేసిన తహసీల్దారుగారే యీయనండి.

నాయుడు — ఇంగ్లీష్ రాకపోతే నేమండి? తహసీల్దారుగారు యెంత ప్రాజ్ఞులు. పూర్వపు యూరోపియన్ అధికార్లని యెంత మందని మెప్పించారు! ఆయన లుబ్ధావధాన్లుగారి కేసు కామాప్ చేశారని భీమారావు పంతులుగారు అంటున్నారు. యింకా యిన్క్వైరీ అవుతూవున్న కేసులో అలా అన్నందుకు యీయనపైని తహసీల్దారుగారు పరువునష్టం ఛార్జి తేవడానికి వీలువున్నది.

కర — (భీమారావువైపు జూచి) పిల్లకు పదహారు సంవత్సరములకు లోపుయీడని రుజువున్నదా?

భీమా — జాతకంవుందండి.

నాయుడు — కోర్టువారు ఆ జాతకం దాఖలు చేసుకోవాలి.

భీమా — యీ కేసులో ఆయన మాట్లాడతూవుంటే నే నంతమాత్రం వొప్పేదిలేదు.

నాయుడు — యీ కేసులో నాకూకూడా వకాల్తినామా వుందండి (అని దాఖలు చేయును.)

భీమా — (అగ్నిహోత్రావధాన్లుగారితో) యేమయ్యా యీయనకూడా వకాల్తీ యిచ్చావయ్యా.

అగ్ని — మొదటా, రామప్పంతులు యీయనకిప్పించారు.

భీమా — (అగ్నిహోత్రావధాన్లుగారితో) అయితే యేడుపు.

(అగ్నిహోత్రావధాన్లు వెల్లిపోయి చూచును.)

కర — యేదీ జాతకం దాఖలుచెయ్యండీ.

(భీమారావుపంతులు దాఖలుచేయును)

నాయుడు — కోర్టువారితో వక సంగతి మనవి చేసుకుంటాను. యీ జాతకం విశ్వామిత్రుడంత యోగ్యుడైన బ్రాహ్మడిచేత తయారు చెయ్యబడ్డది, అదుగో ఆ మూల నిలబడ్డ రామప్పంతులుగారికి యీ జాతకంలో మంచి ప్రవేశం వుందండి.

మా—నేను పేపర్ వకీల్ని. కేసు హియరింగు నేనే చేయవలెనుగాని, నాయుడుగారు చేస్తే నే నెంతమాత్రం వొప్పేదిలేదు.

నాయ—స్మాలెట్ దొరగారిదగ్గిర్నుంచీ యేజన్సీ కోటుఖానాలో వకాల్తీ చేస్తున్నాను, డబ్బుచ్చుకున్నందుకు నాపార్టీ తరఫున నాలుగుమాటలుచెప్పి తీరుతానుగాని యింగ్లీష్ చదువుకున్న కొందరువకీళ్ళలాగ నోటంట మాటాకుండా కొయ్యలాగ నిలబడనండి,

కలె—(అగ్నిహోత్రావధానుల వైపుజూచి) మీ కొమార్తె, యేసంవత్సరమందు పుట్టిందయ్యా ?

అగ్ని—అంగీరస,

కలె—జాతకంలో భావనుందే ? బ్రాహ్మణ్యం పసుపంతా తీసేస్తిరే. గడ్డితిని పిల్ల నమ్ముకున్నావు సరే కాని, యీలాటి ఫోర్జరీలుకూడా చేయిస్తావూ ? బ్రాహ్మల్లో వున్నంత, ఖంగాళీ, పూలకూదూ మరెక్కడాలేదు. నీదుర్మార్గత వల్ల నీకుమార్తెను యీ అవస్థలోకితెచ్చి మళ్ళీ ఎబ్డక్షన్ కేసుకూడానా ? నీపొట్ట కరిగించేస్తానుండు. (గుమాస్తాతో) కేసులో నోటీసులుచెయ్యి,

గుమా—(ఛార్జికాగితముజూచి) యిందులో ముద్దాయీ యింటిపేరూ సాకీనూ లేదండి,

నాయు—(లేచి) యీ అజీజీ వల్లకాట్లో రామనాథాయ వ్యవహారం లాగుంది, ఇంగ్లీషు వకీళ్ళు దాఖలుచేసే కాగితాలు యీరీతినే వుంటాయండి.

మా—(గుమస్తాతో రహస్యముగా) తరవాయీలు నిలపించలేరుటయ్యా ? (పైకి) యీలా నాయుడుగారు నన్ను తూలనాడుతూంటే కోటుఖానారు ఊరుకోవడం న్యాయంకాదు.

కలె—నాయుడుగారు మిమ్మ నేమీ అన్లేదే ?

మా—(తనలో) యిక్కడికి నేను రావడం బుద్ధిపొరపాటు,

క్లర్క—(భీమారావు పంతులుగారితో) ఇంటిపేరూ, సాకీనూ యేమిటండి ?

మా—(అగ్నిహోత్రావధాన్లు గారితో) ఏమిటయ్యా ?

అగ్ని—ఆయనపేరు గిరీశం, మరంతకంట నాకు తెలియదు.

కలె—చాబాష్; బాగావుంది ! అవధాన్లు గారి కొమార్తెని యెవడో తీసుకుపోయి నాడు. కనక వాడి వూరూపేరూ యెరిగినవాళ్ళు తెలియచెయ్యవలసినదని దండోరాకొట్టించి గెజెట్లో వేయించండి. పోలీసువారికి యెందుకు నోటీసివ్వ లేదూ ! సాకీనూ మొదలైనవి లేనిదీ కేసు యడ్మిట్ చెయడానికి వీలులేదు, టిఫిన్‌కి వేళయింది లేదాము (అనిలేచి వెళ్ళిపోవును.)

